# జ్ఞాననేత్రం

వాచస్పతి





'వాచస్పతి'గారి మరొక ప్రసిద్ధ నవల

అంతస్తులూ - అంతఃకరణలూ 5-00

## ఇందులో

1. రాధ
2. జీవితానికి అర్థం
3. రంగుటద్దాలు
4. పాప
5. మనుషులూ - మమతలూ
6. మాతృదేవి
7. జ్ఞాననేత్రం
8. మనిషి - దేవుడు

వివిధ ప్రసిద్ధ పత్రికలనుంచి
పునర్ముద్రింపబడినవి

# జ్ఞాననేత్రం

(కథల సంపుటి)

వాచస్పతి




సర్వోదయ పబ్లిషర్సు
విజయవాడ-2

# రాధ

మధురాతి మధురమైన సుందరస్వప్నంనుండి లేచి స్వర్గ లోకంలో తేలిపోతున్నట్లు తూల్తూ వెళ్ళి గూట్లోవున్న అద్దంముక్క తీసుకుని చూసుకుంది రాధ—ఆత్రంగా ఆశగా. సుఖస్వప్నం తాలూకు మహదానందం క్షణంలో పటా పంచలైంది. కసిగా అద్దాన్ని గూట్లోకి విసిరి—మళ్ళీ కుక్కి మంచంలోవ్రాలి కళ్ళు తుడుచుకుంది.

ఎన్నాళ్ళగానో తపస్సు చేస్తుంటే—అందాల ఆ స్వర్లోకవాసిని ప్రత్యక్షమై మధుర మందహాసాన్ని చిలికించింది.

ఆ భువనమోహనరూపాన్ని చూళ్ళేక తనహృదయం వలవల ఏడ్చింది.

"ఎందుకలా ఏడుస్తావ్! ఏం కావాలి రాధా!" అంది ఆ త్రిలోకసుందరి – తీయ్యని కంఠంతో.

"నాకావల్సింది ఎవ్వరూ ఇవ్వలేరు!" —నిరాశగా అంది రాధ.

"నా మహిమ నీకు తెలీదు" నవ్వింది ఆ జగన్మోహిని.

"నీ అందాన్ని నా కివ్వు!"

"నీ హృదయం నాకన్నా అందమైంది!"

"కానీ ఏం ప్రయోజనం! అది ఎవ్వరికీ కనబడదు."

"దానివల్ల నష్టమేం లేదే!"

"నా బాధ నీ కర్థం కాదు."

"సరే! నా అందాన్ని నీ కిస్తున్నాను."

ఆ సౌందర్యరాశి మాయమయింది.

అంతా మోసం! ఆ అందం తనకు రాలేదు. చివరకు దేవతలుగూడా మోసం చేస్తున్నారు.

రాధ బరువుగా మూల్గింది.

పిల్లికంటపడ్డ ఎలుక ప్రాణరక్షణకోసం కలుగులోకి పరుగెత్తింది.

ఎందుకో ప్రాణంమీద అంత మోజు! అనిపించింది రాధకు.

హృదయం బాధతో మెలికలు తిరిగిపోతుంది.

కిటికీలోనుండి వచ్చిన సూర్యకిరణాలు రాధ బాధను అర్థం చేసుకున్నట్లు వెచ్చగా మెల్లగా తాకాయి.

ఎంతదూరంగా నెట్టేసినా తన అందవిహీనం మాటి మాటికీ గుర్తుకొచ్చి గుండెను బ్రద్దలు చేస్తుంది.

తనేం అపకారం చేసిందనీ-లోకంలోని అందవిహీనత నంతావర్చి-కరుణామయుడైనభగవంతుడుతనలోకూర్చాడు? తనకన్నా పాపం చేసినవాళ్ళు ప్రపంచంలో యికలేరా? తను చేసిన పాపాలకు యింతకన్నా కఠినమైన శిక్ష మరొకటి లేదా? పోని తన బాధనంతా హృదయంలో దాచుకుని తన ఏడుపేదో తను ఏడుస్తుంటే చుట్టూవున్న వీళ్ళ కాకి గోలేంటి? చూసినవాళ్ళంతా తన్నుగూర్చి ఎగతాళిగా మాట్లాడడమే!

ఓ రోజున స్కూలునుండి వస్తుంటే కాలేజీపిల్లలు ఎదురయ్యారు.

గుండె దడదడ కొట్టుకోగా నాలుగంగల్లో వాళ్ళను దాటింది తను.

"ఎవర్రా! ఆ హెలెన్ ఆఫ్ ట్రాయ్!"

విద్యావంతు డొకడు ఆశ్చర్యం నటించి అన్నాడు.

తక్షణ ప్రబుద్ధులంతా పక్కున నవ్వారు. తన ఒంటి మీదంతా తేళ్ళూ, జెర్రులూ పాకినట్లయింది.

తన అనాకారితనాన్ని భరించేపాటి సంస్కారం గూడా యీ విద్యావంతుల్లో లేదా? ఆ ఒక్క వాక్యం వాళ్ళకెంత ఆనందాన్నిచ్చిందో - దానికి వెయ్యిరెట్లబాధ తనలో కలుగుతుందని ఆలోచించేపాటి హృదయ వైశాల్యం లేకపోయిన పిదప ఎందుకా చదువు? తగులబెట్టనా?

సృష్టిలోని సౌందర్యాన్ని చూచి ఆనందించిన మానవుడు-ఆ సృష్టికర్త చేతుల్లోనుండి వచ్చిన మరో అనాకారి వస్తువుపై సానుభూతిచూపి ఆ సర్వేశ్వరుని చిద్విలాసాన్ని అర్థంచేసుకునేపాటి సహృదయం లేకపోయిందేం?

అయినా తన అనాకారితనం తన స్వయంకృతాపరాధం కాదే?

"రాధా! ఎప్పుడో తెల్లారింది! ఇంకా పడుకొనే వున్నావా?" ముందు గదిలోనుండి రంగారావు కేకేశాడు.

రాధ బరువుగా లేచి ముందుగదిలో కొచ్చింది.

రంగారావు ఆత్రంగా పేపర్లో దేనికోసమో వెతుకుతున్నాడు.

"నువ్వు పాసయ్యావు రాధా!"

పేపర్లోనుండి తలెత్తి పట్టరాని సంతోషంతో అన్నాడు రంగారావు.

"నాకు తెలుసు" నిర్లిప్తంగా అంది రాధ.

"ఏం తెలుసు!" ఆశ్చర్యంతో అన్నాడు రంగా రావు.

"నే పాసవుతానని తెలుసు నాన్నా!" బాధగా నవ్వి అంది రాధ.

కూతురి ఆత్మవిశ్వాసానికి గుడ్లు పెద్దవిచేసి నోరు తెరిచి చూశాడు ఎలిమెంటరీ స్కూలుటీచరు.

"నే వెళ్ళి పేపరిచ్చి వస్తాను. కాఫీ పెట్టు రాధా!"

రాధ మౌనంగా లోపలి కెళ్ళింది.

ఎందుకనో హృదయమంతా కోపంతో అసహ్యంతో నిండుకొన్నాయి.

ఏ భావమైన జైటపెట్టేనేతప్ప లేకుంటే చక్రవడ్డీలా నిముషనిముషానికీ పెరిగిపోతుంది. తనకోపాన్ని ఎవరిమీద చూపుదామన్నా మనుషులే కనబడరే! అనుకుంది రాధ!

పెరట్లోకెళ్ళి ముఖం కడుక్కుని వంటింట్లో కొచ్చింది. బొగ్గుల డబ్బాలోవున్న నాలుగే నాలుగు బొగ్గులు కుంపట్లో వేసి ముట్టించి కాఫీకి నీళ్ళుపెట్టింది. నాలుగు బొగ్గులైనా రాధ హృదయంలా భుగభుగ మండుతున్నాయి.

"కాఫీ అయిందా రాధా?" చెయ్యిలేని కుర్చీలో కూలబడుతూ అడిగాడు రంగారావు.

రాధ కామాటలు వినిపించినా వినేస్థితిలో లేదు.

కాఫీ కలుపుతున్నా—ఆలోచనలు శరవేగంతో పరుగెత్తిపోతున్నాయి.

'రాధా' అని ఎవరు పిల్చినా, గాయాన్ని గెలికినట్లు తన హృదయం జివ్వుమంటుంది. తనకంత అందమైన పేరు తగనిమాట నిజమే! కానీ అదీ తన తప్పు కాదు. తనతో సంప్రదించకుండానే తనకాపేరు పెట్టడం జరిగిపోయింది.

ఓ రోజున క్లాసులో అటెండెన్సు పిలుస్తుంటే తను ప్రెజెంటు చెప్పి కూర్చున్నాక—

"పేరు అందమే చెడిందిరా!" అన్నాడో కొంటె కోణంగి వెధవ తనకు వినిపించేలా! వాడి పక్కనున్న కోతులిద్దరూ పండ్లికిలించారు!

ఆరోజు తన హృదయంలో కలిగిన తుఫాను వర్ణనకు అతీతం!

ఇతర్ల మనసులను బాధించి ఆనందించే ఆ రాక్షసాత్ములను మనుషులలో లెక్కవేయడం పొరబాటని తను వాళ్ళ మాటల్ని లెక్కచేయడం మానుకుంది. అయినా ఒక్కోసారి హృదయం బాధపడుతుంది, ఏడుస్తుంది—తనకు తిరగబడుతుంది! తను అందంగా లేనంతమాత్రాన అందమైన పేరు పెట్టుకోనుగూడా తనకు హక్కులేదా? అందాన్ని ఆస్వాదించే అతి మెత్తని సౌందర్యభరితమైన హృదయాన్ని భగవంతు డెందుకిచ్చాడు మరి?

"ఏం చేస్తున్నావమ్మాయ్!"

"వస్తున్నా నాన్నా!"

కాఫీగ్లాసు తెచ్చి రంగారావుచేతి కిచ్చింది.

"చక్కెర లేదన్నావుగదూ?" కాఫీ చప్పరిస్తూ అడిగాడు.

"ఊ...పిన్నిగారిదగ్గర బదులు తీసుకున్నాను."

"ఆమాట మర్చేపోయ్యాను" ఖాళీగ్లాసు రాధ చేతిలో పెడ్తూ అన్నాడు.

రాధ సన్నగా నవ్వి లోపలి కెళ్ళిపోయింది.

రంగారావుకు మతిమరుపంటూ వుండదుగానీ — డబ్బు లేకపోవడమే మతిమరుపుకు ముఖ్యకారణం! పొద్దుట బదులుతీసుకున్న రెండు రూపాయల్లో ఓ అర్థపిసెడు చక్కెర తెద్దామని సంచి పట్టుకొని బజారుకెళ్ళాడు. ఆ బొగ్గులమీదే బియ్యం కడిగిపెట్టి పిల్లలు తెచ్చిచ్చిన దోస కాయ తరగసాగింది రాధ.

"ఏమేవ్! రాధా! ఏంచేస్తున్నావ్?"

చంకలో మూటతో తొంగిచూసింది పార్వతమ్మ.

కళావిహీనంగావున్న రాధ ముఖంలో చిరునవ్వు తొణికిసలాడుతుంది.

"రా! బామ్మా! యిప్పుడేనా రావడం? అత్తయ్య వాళ్ళు కులాసాగా వున్నారా?" కత్తిపీటమీదనుండి లేచి అంది రాధ.

"అంతా బాగున్నారే! దార్లో కిష్టడు కనబడి చెప్పాడు, నువ్వు పాసయ్యావటగదూ?"

సంతోషంగా అంది పార్వతమ్మ! రాధ ఏం సమాధానం చెప్పకండా ముసలావిడ ముఖంలోకి చూడసాగింది.

"ఏమిటే తప్పావా?" గాభరాగా అంది ముసలావిడ.

"ఊహు! అలా ఎప్పటికీ కాదు."

"నిజమేనే తల్లీ, నీ తెలివితేటలు నాకు తెలీదూ! మీ అమ్మేవుంటే ఎంత సంతోషించేదో! ఇదో! మీ అత్త పంపింది-మల్లెపూలు" పూలపొట్లం రాధ చేతిలో పెడ్తూ అంది. రాధ పూలపొట్లం తీసుకుని స్టూలుమీద పెట్టింది.

"అలాగున్నావేం? తర్వాతేం చేస్తాట్ట మీ నాన్న? పై చదువుకు పంపుతాడా?"

"ఊహు! లేదు బామ్మా! ఉండు నీకు కాఫీ పట్టుకొస్తాను."

"ఇప్పుడేం అక్కర్లేదే రాధా! యింతకూ వీ డెక్కడ?"

"బజారు కెళ్ళాడు. అడుగో!"

"అమ్మా, ఎప్పుడు రావడం? అక్కయ్యవాళ్ళంతా కులాసేనా?"

"అంతా బాగున్నారు. ఏంటో అక్కడున్నానన్న మాటేకానీ - తల్లి లేన్ది! — యిది ఎలాగుందోనని మన సంతా ఇక్కడే!"

"మరి నేనేం చెయ్యను? నేం తాగే కలో గంజో నువ్వు తాగుతావంటే—అక్కయ్య నామాట వింటేనా? పెద్దతనంలో యిక్కడ నీకు అమరికగా వుండదని అక్కయ్య నిన్నక్కడకు తీసికెళ్ళె! నువ్వూ అక్కయ్య మాటకు తాళం వేస్తివి!"

"అవున్రా! వాళ్ళేదో అంటున్నవాళ్ళు! ఎక్కడైతే ఏం? యిద్దరూ బిడ్డలేగా!"

మూట విప్పి ఒక్కో వస్తువే బైటపెడ్తూ అంది ముసలావిడ.

"అప్పన్నేవే! ఎలా చెప్పుకున్నా సరిపోతుంది!"

"యిదో! రాధా! మీ అత్తయ్య నీకీ చీర పంపింది."

"యీ చీర నే కట్టుకుంటే దీని అందంకూడా పోతుందేమో!"

రంగారావు బాధగా చూశాడు రాధ ముఖంలోకి.

"అదేంటే! చిత్రంగా మాట్లాడావు!"

ముసలావిడ దండించింది.

"నీకు తెలీదు బామ్మా!"

"చాల్లే! నోర్మూసుకో!"

రాధ చీర తీసుకుని లోపలికెళ్ళింది.

పార్వతమ్మ తను తెచ్చిన పప్పులూ కూరగాయలూ వంటింట్లోకి తీసికెళ్ళింది.

రంగారావు డాక్టరిగా రమ్మాయికి ట్యూషను చెప్పేందుకు వెళ్లాడు.

ముసలావిడ బావిదగ్గరకెళ్ళి రెండు చెంబులు నీళ్ళు పోసుకుని మడికట్టుకుని కుంపటిముందు కూర్చుంది. కుంపటి మీద పెట్టిన బియ్యం నీళ్ళు సత్యాగ్రహం చేసినట్లు అలాగే వుండిపోయాయి. బొగ్గులుంటేగా వుడికేందుకు! గిన్నె దించి బియ్యం మరి రెండుసార్లు కడిగి - బొగ్గులకోసం చూసింది పార్వతమ్మ.

"బొగ్గుల్లేవూ!"

"అయిపోయాయ్!"

"అన్నం కూరెలా అవుతుంది?"

"ఆ బొగ్గుమీద అన్నమన్నా అయ్యింటే దోస కాయ పచ్చడిచేస్తే సరిపోయేది"

ముసలామె బరువుగా మూల్గి,

"పోనీ! రాత్రి వంటకో" అంది. ప్రక్కింటికెళ్ళి చిన్న బుట్టనిండా బొగ్గులు తెచ్చింది రాధ.

కొడుకు ఆర్థిక పరిస్థితికి పార్వతమ్మ చాలా కలవర పడింది.

"మీ అత్తయ్యకే కొడుకుంటే ఎలాగో నీ మెళ్ళో మూడు ముళ్ళు వేయించేదాన్ని." రాధ ముఖంలోకి చూసి విచారంగా అంది ముసలావిడ.

"లేకుండడమే మేలయింది" రెండుగదులకు మధ్య నున్న గడపల్లో కూలబడ్తూ అంది రాధ.

పొట్లకాయ తరుగుతున్న ముసలావిడ తలెత్తి చిత్రంగా చూసింది రాధముఖంలోకి. తొమ్మిదిన్నరకు రంగారావు భోంచేసి స్కూలు కెళ్ళేటప్పుడు పార్వతమ్మ కొంగునున్న రెండురూపాయలు తీసి రంగారావు చేతిలో పెట్టి బొగ్గులు పట్టించుకు రమ్మంది.

రాధ కంచంలో అన్నంపెట్టి తనింత తిని గీతా పారాయణం మొదలుపెట్టింది ముసలావిడ.

ఆ సాయంత్రం యింటికొచ్చేటప్పుడు ఓ అణా కూలీ యిచ్చి బొగ్గులు పట్టించుకొచ్చాడు రంగారావు.

ముసలామె ఓ గంటలో వంట ముగించింది. రాధ

బెడ్ లైటు వెలిగించి రెండు గదులమధ్య గడపలో పెట్టి - లైటుముందు కూర్చుని పాత న్యూస్ పేపరు తిరగెయ్య సాగింది ముసలామె ముందుగదిలో రంగారావు కూర్చొని ఉన్న కుర్చీకి ప్రక్కగా చేరగిలబడి కొడుకుతో మాటల్లోకి దిగింది.

"రాధ విషయం ఏమనుకున్నావు? పెళ్ళి మాటే మన్నా ఆలోచించావా?"

"లేదమ్మా! డబ్బు కావొద్దూ? వచ్చే అరవై భోజనానికే సరిపోకపోయె!"

"నర్సింగ్ కన్నా - టీచర్ ట్రెయినింగ్ కన్నా వెళ్తా బామ్మా!" పేపర్లోనుండి తలెత్తి అంది రాధ.

"ఏంటీ? నర్సుగానా? అవ్వ!" నోరు నొక్కుకుంది ముసలావిడ.

"ఏంబామ్మా! తప్పా?"

"తప్పా! తప్పున్నరా! నర్సుపని చెయ్యడం మన యింటా వంటా వుందా? నర్సుపనిచేసి కిరస్తానీవాళ్ళల్లో కలిసిపోతానంటే! ఏవిట్రా యిది రంగా!"

"ఏవిటమ్మా!"

"నర్సు ట్రెయినింగ్‌కు పంపిస్తావా?"

"యింకా ఆ మాటేం అనుకోలేదు."

"ఇంక చదువూ వొద్దూ— పాడూవొద్దూ చదువులు పూర్తయ్యాక పెళ్ళిళ్ళు చెయ్యాలంటే ఎంతకష్టమో ఓసారి కళ్ళు తెరిచి నాలుగువైపులా చూస్తే తెలుస్తుంది. ఏూ చిన్నాన్న కూతుళ్ళు లేర్రా! కామేశ్వరీ-వారిజా - ముఫ్ఫ

య్యేళ్ళ బిడ్డా అలాగే వుండిపోయ్యారా? మొన్న కసబడి పాసం కష్టాలన్నీ వెళ్ళబోసుకున్నాడు ఎందుకు చదివించానా అని యిప్పుడు బాధపడుతున్నాట్ట! రెండో సంబంధానికైనా మూడో సంబంధానికైనా యివ్వడానికి సిద్ధంగా వున్నాట్ట! విన్నావా?"

"అలాగా!"

"అసలా వారిజమీద్దైతే ఏఁ టేంటో కథలు వూరంతా చెప్పుకుంటారు! నిజానిజాలు ఆ భగవంతుడికే తెలియాలి మరి! నువ్వేమన్నా చెప్పరా రంగా! పెళ్ళికాకుండా ఆడపిల్ల యింట్లో వుంటుంటే నలుగురు నాలుగు రకాలుగా చెప్పుకుంటారు—"

"నీదంతా చాదస్తమమ్మా!" నవ్వి అన్నాడు రంగారావు.

"మీరెన్నన్నా అనండి! నిప్పులేందే పొగ రాజుతుందంటారా?"

"లోకులు కాకులు బామ్మా! ఆ కాకి కూతలకు విలువలేదు" బెడ్ లైటు వత్తి కొద్దిగా ఎక్కిస్తూ అంది రాధ.

"మీ చిన్నాన్న ఆరోజు చెప్తే నామాట చెవినేసుకున్నాడా! ఈరోజు అనుభవిస్తున్నాడు!"

"లోకంలో ఎంతమంది చదువుకోటంలేదు బామ్మా" విసుక్కుంది రాధ.

"అందరి సంగతి మనకెందుకే తల్లీ! అసలు చదివించే శక్తి మీనాన్నకు లేదు. ఏ అయ్యచేతిలోనో నిన్ను పెడితే

వాడి బరువు తీరిపోతుంది. ఎప్పటికైనా ఒకడి చేతిలో పెట్టా లిసిందేగా!"

"నేను పెళ్ళి చేసుకోను బామ్మా!"

"అదేం!" పార్వతమ్మా రంగారావు ఆశ్చర్యంగా అన్నారు.

"నాకు పెళ్ళేంటి!"

"దీనికి తెలివెక్కువైందిరా!" అంది ముసలావిడ.

పార్వతమ్మ మాటకు జవాబు చెప్పకండా రంగా రావు ఆలోచించసాగాడు.

మూడు సంవత్సరాలుగా తను చూస్తున్నాడు, రాధ వైఖరి ఒక విధంగా వుంది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుం టుంది. పద్ధెనిమిదేళ్ళ పిల్లలో వుండాల్సిన వుత్సాహంగానీ సంతోషంగానీ రాధలో లేవు. ఇన్నాళ్ళుగా రాధ అనాకారి తనాన్ని గురించి తను ఎక్కువగా ఆలోచించలేదు. అసలు రాధ అనాకారిగా తనకళ్ళకు కనిపించనేలేదు. ఈరోజు ఆ అనాకారితనమే తన జీవన సమస్యగా తయారైందని తెలుసు కోడానికి ఆట్టేకాలం పట్టలేదు రంగారావుకు. తనెంత అనా కారో రాధకు తెలుసు – అందుకే పెళ్ళి చేసుకోనంటుంది– తను వొప్పుకోవడం కాదుగానీ–తన్ను చేసుకోను ఎవ్వరూ ఇష్టపడరని రాధకు తెలుసు. రాధ ఎంత అనాకారో అంత తెలివిగలది! నివురుగప్పిన ఆ తెలివితేటల్ని ప్రకాశింప చెయ్యాలంటే–దానికి సాధనం ఒకటే ఒకటి డబ్బు! డబ్బు కావాలి! తనదగ్గర డబ్బు లేదు. రాధ తెలివితేట లలా అణగారిపోవాల్సిందే!

"ఒరే! ఎదిగిన పిల్లను అలా యింట్లో వుంచుకో గూడదురా! మనకు తగినట్టే గంతకుతగ్గ బొంతలా ఏదో ఓ సంబంధంచూసి ముడేస్తే సరిపోతుంది."

రంగారావు దీర్ఘాలోచనకు అడ్డుపడింది ముసలావిడ.

"నాకు తెలుసమ్మా! కానీ ఏం చెయ్యను? ఈకాలంలో డబ్బుంటే కోతికైనా పెళ్ళి చెయ్యొచ్చు!"

"లేని డబ్బు రమ్మంటే ఎక్కణ్ణుంచి వస్తుంది? మన అందుబాటులో వుండే సంబంధమే చూసుకోవాలి! మీ అక్కయ్యే పెళ్ళిఖర్చు పెడ్తానంది."

"అదికాదమ్మా! దారినపొయ్యే దానయ్యకిచ్చినా వాడు రాధను చేసుకోను యిష్టపడొద్దూ?" కూతురి అనాకారితనాన్ని అంతకన్నా విడమర్చి చెప్పడం రంగారావుకు చేతకాలేదు.

"దానికేంరా? బంగారంలాంటి బుద్ధీ, తెలివితేటలూను—అయినా శాస్త్ర ఎఱ్ఱతోలుంటే సరిపొయ్యేది—ఈ నల్లరంగు మన యింటా వంటా లేదురా, ఎక్కణ్ణుంచి వచ్చిందో మరి!" ఆశ్చర్యపడింది ముసలావిడ.

"తాతయ్య నల్లగా వుండేవాడు కాదూ?"

"ఏం కర్మో! మీ అక్కయ్య వాళ్ళూళ్ళోనే ఒక సంబంధముంది - మూడో పెళ్ళే అనుకో! మాంచి స్థితిపరుడు! రమ్మని రాస్తే వచ్చి అమ్మాయిని చూసిపోతాడు."

"మూడో పెళ్ళా!" గొణిగాడు రంగారావు.

"రాధ ఒప్పుకోదనా? దాన్ని ఒప్పించే భారం నాది"

"ఆ పెళ్ళి చెయ్యకుంటే నేం? యింట్లోనే వుంటుంది."

"ఎన్నిరోజు లుంటుంది? మనిద్దరం శాశ్వతమా! తర్వాత దాని గతేం కావాలి!"

"ఏ ట్రెయినింగుకో పంపిస్తే సరి"

"నే నింతవరకూ వాగింది నీకర్థం కాలేదన్న మాట! మళ్ళీ మొదటి కొచ్చావేంరా!" పార్వతమ్మ విసుక్కుంది.

"మరి నువ్వు చెప్పేదేంటి?"

"నే చెప్పిందాన్లో ఎంత నిజముందో కాస్త తీరిగ్గా ఆలోచించుకో! డబ్బా! లేకపోయె! పోనీ పిల్ల అందంగా వుందా అంటే అనాకారాయే! యిక ఎలాంటి సంబంధం వొస్తుందనుకున్నావు?" రాధ బాధ పడ్తుందనన్నా లేకుండా పెద్దగా అరిచింది ముసలావిడ.

"అలాగని?"

"ఆ మూడు ముళ్ళూ పడితే దానికీ మనకూ నలుగుర్లో గౌరవం! పెళ్ళయిందనే దానికి పెళ్ళి కాలేదనే దానికీ ఎంతో భేదముంది. తొందరపడక కాస్త ఆలోచించుకో!" పార్వతమ్మ పోరుపడలేక వాళ్ళకుత్తరం వ్రాసి పడేశాడు. రంగారావు. ఫలాని రోజు వస్తున్నట్లు ముందుగా తెలియజేసి వచ్చాడు పెండ్లికొడుకు. పెండ్లికొడుకుతో పాటు అతని బంధువొకాయనకూడా వచ్చాడు.

అతను రాధను చూశాడు—ముందు కాస్త జంకిన మాట నిజమే! కానీ తర్వాత ఆలోచించాడు.

తన కావలసిందల్లా ముందుభార్యల బిడ్డలను పోషించడానికి ఆయా మాత్రమే! నాలుగువైపులున్నండి

రావందాడీగా పనివాళ్ళు బైటకు చేరవేసే వస్తువుల్ని కాస్త ఆపి ఒకకన్ను వాళ్ళపై వేసి యింటిని కనిపెట్టుకొనుండడం! అమ్మాయి తెలివైందని చెప్తున్నారు గనక అలాంటి పనులన్నీ శ్రద్ధగా చేయగలదు. రాధకూడా చూసింది. చూడాలనే ఆశతో చూడకున్నా, యధాలాపంగా చూడ్డం తటస్థపడింది.

రాధ ఏనాడూ తన వైవాహిక జీవితాన్ని గురించి సుఖ స్వప్న సౌధాలను కట్టుకోలేదు. అందుకనే తన తండ్రి వయసులోవున్న పెండ్లికొడుకును చూసినప్పటి కూడా ఏ మాత్రం కలవరపడలేదు. తనకా వలసిందల్లా ఆ మూడు ముళ్ళు పడ్డమే! బామ్మ అన్నట్లు తన కప్పుడు సంఘంలో ప్రత్యేకమైన ఓ స్థానం లభిస్తుంది.

ఆడది పుట్టాక ఆ మూడు ముళ్ళూ అవసరముంటుంది బామ్మ!

తను యిన్నాళ్ళుగా ఆలోచించి చూసినా తనకు తోచిందికూడా అంతే!

రాధ పెళ్ళికి ఒప్పుకుంది.

రంగారావుకు యిదేమంత ఆశ్చర్యంగా తోచలేదు. ఇప్పుడిప్పుడే రాధకు కాస్త అర్థమవుతున్నట్లనిపించింది రంగారావుకు. ముసలావిడ మనుమరాలి తెలివితేటలకు మరోమారు మురిసిపోయింది.

ఓ వారంరోజుల తర్వాత పెండ్లికొడుక్కు గుండెజబ్బు కావడంచేత చనిపోయాడనీ ఎవరో వార్త పట్టుకొచ్చారు.

ఆ విషయం విన్న రంగారావు సంతోషించకండా వుండ లేకపోయాడు.

రాధ నిర్వికారంగా వుండిపోయింది. మరో పది రోజులపాటు తిరిగి అతి కష్టంమీద మరో సంబంధం తేగలిగాడు రంగారావు.

రాధ అనాకారని అతను యిష్టపడలేదు. ప్రెస్సులో కంపోజిటరు ఒకతను రాధను చూసి ఐదువేలు కట్న మిస్తే చేసుకుంటా నన్నాడు.

రాధకు నవ్వొచ్చింది. అప్పుడు తను అందంగా కనిపిస్తుందేమో!

మరో యిద్దరు పెండ్లికొడుకుల్ని చూసి రాధ గ్రహించిన విషయం—డబ్బుంటే కొండమీద కోతికన్నా పెండ్ల వుతుందనీ — తన అనాకారితనం ఏ మాత్రం పెండ్లికి అడ్డు పడదనీ,—కానీ ఆ "డబ్బు" తమకు సుదూరంలో వుండడంచేత యిక తనకు పెళ్ళి కాదనీ తెలుసుకొంది.

ఓ రోజున నిద్ర లేచేసరికి వంటింటినుండి కుంపటి విసరిన చప్పుడు ముసలావిడకూ, రంగారావుకూ వినిపించ లేదు. ముసలావిడ పెరడంతా గాలించింది. రంగారావు కంగారు అంతాయింతా కాదు.

రాధ యింటి ఎదురు డాబాలో వున్న సుందరాంగి యొక్క రాధ లేచిపోయిందనే వార్తను రాకెట్‌లా వద లేసింది.

అర్ధగంటకల్లా-వూరు చుట్టిచుట్టి వచ్చి రంగారావు గుండెల్ను బ్రద్దలు చేసిందా వార్త.

ముసలామె ముఖంలో కత్తివేసినా నెత్తురు చుక్క లేదు.

"రాధ అలాంటిది కాదమ్మా! నీకు తెలీదు!" ఏడ్వ లేక సన్నగా నవ్వి అన్నాడు రంగారావు.

ఆ మూండోరోజు పాత కుర్చీలో కూలబడి రాధను గురించి తీవ్రంగా ఆలోచిస్తున్న సమయంలో పోస్టుమన్ ఓ ఉత్తరం యిచ్చి పొయ్యాడు-రంగారావు చేతికి. ఆత్రంగా విప్పి చదివాడు.

నాన్నగారికి—

నమస్కారములు. మాటమాత్రమైనా చెప్పకుండా నేనిలా వచ్చినందుకు మీరు చాలా కలవరపడుతుంటారు. నిజమే! ఆడపిల్ల యింట్లో చెప్పకండా రావడం క్షమించ రానితప్పు. కానీ ఏంజేయను?

'ఆయా' పనికి నే వెళ్తానంటే మీ రెవ్వరూ ఒప్పు కోరని చెప్పకుండా రావలసివచ్చింది. వచ్చే సంవత్సరం పీళ్ళే నర్సింగ్‌కు పంపుతా నన్నారు. నేనీపని చెయ్యడం బొమ్మ కిష్టం వుండదు. కానీ గత్యంతరం లేదు.

నా జీవన గమ్యానికి మార్గం అందరిలాంటిది కాదని తెలుసుకొన్నాను. నాన్నా! భగవంతుని సృష్టిలో గడ్డి పోచకుగూడా స్థానముంది. నేను అనాకారినే కావచ్చు. అంతమాత్రంచేత లోకానికి ఉపయోగపడకండా

పోతానా? బామ్మను ఏం బాధపడొద్దని చెప్పు. ప్రక్కన నా అడ్రసు యిస్తున్నాను. వీలైతే ఓసారి రావలసింది.

ఇట్లు,
రాధ.

రంగారావు బరువుగా నిట్టూర్చి జాబుమడిచి జేబులో పెట్టుకున్నాడు.

"కానీ అందరూ అనుకోవడం రాధ లేచి పోయిందనేగా?"

జాబు విన్న ముసలావిడ కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది: "చూడమ్మా! వినడం తప్ప, చూడ్డంరాని ఈ పాడు లోకానికి ఎందుకు భయపడ్తావు? రాధ కాస్త అభివృద్ధిలోకి వచ్చాక ఈ లోకమే ఈ నోటితోనే ఆకాశానికి ఎత్తుతుంది! అన్నీ తెలిసి బాధపడడం అవివేకం! రాధ చేసిన పని ఏనాటికీ చెడ్డది కాదు" సగర్వంగా వీధిలో కడుగేస్తూ అన్నాడు రంగారావు.

—:o:—

# జీవితానికి అర్థం

'రాజూ,

ఆ రోజు—

పవిత్ర పినాకినిలో మునిగి భార జీవితాన్ని ముగించుకోవాలని వెళ్ళాను.

ఆత్మహత్యకు పాలుపడవలసినంతటి అవసరం నీ కేమి వచ్చిందని నువ్వడగవచ్చు.

సంశ్లిష్ట సంకీర్ణమైన మనోభావాల కీకారణ్యంలో నా కే దారీ తెలీని రోజు నీ కెలా చూపను?

అంతులేని ఆర్థికపు చిక్కుల్లో తగులుకొని బయట పడలేకనో—లేక...

హృదయారామంలో ప్రతిష్టించిన ఆరాధనా వేదిక మీద ప్రేమదేవత అధిష్ఠించను అంగీకారాన్ని ఇవ్వనందు వల్లనో, లేక...

సామాన్యుల గుండెలను పిండే అలాంటి మరికొన్ని అనర్థాలు సంభవించడంవల్లనో - జీవితాన్ని ముగించుకోవాలనుకున్నానని నువ్వనుకోవచ్చు.

అలాంటి వేం కావు.

నా ఆత్మహత్యా ప్రయత్నానికి కారణాలు చెప్పితే ఈ ప్రపంచం ఆశ్చర్యంతో నోరు తెరిచి నన్నొక పిచ్చివాడి క్రింద జమకడుతుంది.

చేతి కిచ్చిన అమృతభాండాన్ని ధూళిలో కలిపి నప్పుడు పిచ్చాడనక మరేమంటుంది?

నా మనోభావాలను చిత్రించాలంటే చేతకావడం లేదు.

రంగులన్నీ గజిబిజిగా తయారవుతున్నాయి.

అయినా చేతనయినంతవరకూ ప్రయత్నిస్తున్నాను.

ఆరోజు—

అందరిలో నే నొక్కణ్ణని—అందరికన్నా అధికుణ్ణి కానని—

ఇన్నాళ్ళుగా నాలో—

తాతయ్య చూసిన గాయకుడూ—

నాన్న చూసిన ప్రజానాయకుడూ—

అమ్మ చూసిన చిత్రకారుడూ—

నేను చూసిన కథకుడూ—

అందరినీ మోసగించి ఆశలు నిరాశలుచేసి, చిక్కని అంధకారపు తెరలచాటున లీనమైపోయారని అనిపించింది.

తిరిగి వచ్చిన కథలన్నీ కథకుణ్ణి కాలేనని నొక్కి చెప్పాయి.

తియ్యదనం లోపించిన కంఠం గాయకుణ్ణి కాలేనని తీర్మానించింది.

వాక్చాతుర్యం లేని భాష ప్రజానాయకుణ్ణి కాలేనని చెప్పింది.

రంగులను కలపలేని కుంచె చిత్రకారుణ్ణి కాలేనని నిరూపించింది.

ఆరోజు చేసుకొన్న నిర్ణయం—

నే నొక సామాన్యుణ్ణని—నీలాగ, గోపాలంలా, శేఖరంలా, వెంకట్రావులా, సుబ్బయ్యలా, పేరయ్యలా.

అవును. సామాన్యుల్లో నేనొక సామాన్యుణ్ణి! నాలో ప్రత్యేకత లేదు.

నా చుట్టూ ఉన్నవాళ్ళు నామీద పెట్టుకున్న ఆశల్లో ఒక్కటీ నిజం కాలేదు. ఇక కాబోదనీ ఆరోజే తెలుసుకొన్నాను.

ఏదో ఉద్ధరిస్తానని(ఎవర్నో తెలీదు)—

ఏదో ఘనకార్యం చేస్తానని—

నీలాకాశంలో—నీలాభ్రాల నీడల్లో—అంతకన్నా నీలమైన నీలిమేడలు కట్టుకొని తేలిపోతున్న సమయంలో—

నీలిమేఘాల నీడల్లోని నీలిమేడలు క్షణంలో తమ అస్తిత్వాన్ని కోల్పోయి, మేఘమాలికల కన్నీళ్ళలో కలిసిపోయాయి.

అసామాన్యుణ్ణనుకున్న నేను—సామాన్యుణ్ణే తప్ప మరేం కాలేదని, కాలేనని తెలుసుకొన్నరోజు. అవును. ఆ రోజు ఎలా చెప్పను?

వెయ్యి బాణాలు ఒక్కసారిగా గ్రుచ్చుకొన్నట్లు హృదయం రుధిర స్రవంతిలో మునిగిపోయిన రోజు—

హృదయంలో దట్టంగా పులుముకొన్న నల్లని మసి జీవితవదనంమీద వికృత నటనంచేసి వెక్కిరించిన రోజు—

అవును. ఆ రోజు జీవించడం అనవసర మనిపించింది.

అర్థంకాని ఆలోచనలూ—

అవ్యక్తమైన ఆ వేదనలూ-
అణగారిపోయిన ఆశలూ-

ఆ రోజు జీవితాన్ని ముగించమని నన్ను బలవంత పెట్టాయి.

నీకు తెలుసు నా విచిత్ర మనస్థితి.

"నీవు ఏమైపోతానోనని నాకు బెంగ" అన్నావు ఓరోజు కన్నీటి పొరగుండా.

ఆ రోజు హృదయం కన్నీటి ముద్దయిపోయింది.

నీ అనురాగ జలధికి వారధికట్టి, నన్ను నేను రక్షించుకోవాలని లెక్కకుమించిన ప్రయత్నాలుచేసి చివరకు అందులో మునిగిపోయిన రోజు.

విజయం నీదేననీ—

పరాజయం నాదనీ—తెలుసుకున్న రోజు.

నామీద నేనునిలబడలేననీ, దృఢమైన, బలమైన, కఠినమైన నీ హృదయపు సర్వాధికారంక్రింద తప్ప మరోచోట జీవించలేననీ తెలుసుకున్నరోజు దూరంగా వెళ్ళిపోయిన నీ దగ్గరకు రెక్కలు కట్టుకొని వాలాలనిపించింది.

నీ కనురెప్పల నీడలో నా జీవితాన్ని గడపాలనిపించింది.

కానీ, అది అసమంజసంగా, అర్థరహితంగా కనిపిస్తుంది. నాకాదు. ఈ లోకానికి.

హృదయం విచిత్రమైన స్థితిలో పీగిపోతుండగా పినాకినీతీరం చేరుకున్నాను ఆ రోజు.

మెల్లగా, చల్లగా ప్రవహిస్తున్నది పినాకిని. పూర్ణిమ

నాటి చంద్రుడు నీళ్ళలో తన బింబాన్ని చూసుకుని మురిసి పోతున్నాడు.

చల్లనిగాలి వీస్తున్నది.

ప్రవాహవేగం ఉధృతంగా ఉన్న చోటుకు త్వర త్వరగా చేరుకొన్నాను.

చల్లని నదీమతల్లి చేతులుచాపి నన్ను కడుపులో దాచుకొనేందుకు సిద్ధంగా ఉంది.

కానీ క్షణక్షణం అధైర్యం మనసులో గూడుకట్టు కుంటున్నది. జారిపోతున్న గుండెలను చిక్కబట్టుకొని నీళ్ళ లోకి దిగాను. చల్లని నీళ్ళు కాళ్ళను కౌగలించుకొని ముద్దుపెట్టుకున్నాయి.

మనసులో ఘోర సంగ్రామం చెలరేగింది.

"ఈ ఒక్కరోజుకు ఈ ప్రయత్నం మానుకో. నా కోరిక మన్నించు. రేపు నీ ఇష్టం వచ్చినట్లు చేద్దువుగానీ!" దీనాతిదీనంగా ప్రార్థించింది మనసు.

"ఉహు. ఈ రోజయినా, రేపయినా ఒకటే. జీవితం మీద ఆశ చూపుతున్నావు. నా జీవితం వద్దు. నన్ను బలవంతపెట్టకు." విసుక్కున్నాను.

"ఈ రాత్రి ఎంత బావుందో చూడు. ఈ వెన్నెల, ఈ ప్రకృతి, దూరంగా ఆ వంతెన, ఎదురుగా కనిపిస్తున్న రంగనాయకుల దేవాలయం. ఎంత మనోజ్ఞంగా ఉందో!"

కాళ్ళు నన్ను ఒడ్డుకు చేర్చాయి.

గంటసేపు ఆలోచించి వెనక్కి తిరిగాను, రేపు తప్పకుండా రావాలని!

ప్రకృతి రమణీయం చూసి ఆనందించాలని కాదు. సమీపంలో ఉన్న మృత్యువుకు భయపడి!

రోడ్డంటే నడుస్తున్నాను.

దేవాలయం దగ్గరికి వచ్చాను.

"బాబూ!"

వెనక్కి తిరిగి చూశాను.

బిచ్చగాడు.

లోతుకుపోయిన అతని కళ్ళు లైటుకాంతిలో ఏమో మాట్లాడుతున్నాయి.

ఆ భాష నా కర్థం కాదు.

"ఏం?"

"ఉదయంనుండీ ఒక్క నయాపైసా దొరకలేదు." అది నా తప్పయినట్లు ఫిర్యాదు చేశాడు.

"దొరక్కుంటే?"

"మూడు రోజులనుంచీ పస్తు. బాబూ!"

"ఉ..."

"ఒక్క అణా ఉంటే ఇవ్వండి. పిల్లోడు ఆకల్తో సచ్చి పోతున్నాడు."

"ఆకలి?"

అదెలాంటిదో తెలి సేగా?

"అవును బాబూ! ఆకలి. ఒక్క అణా బాబూ.

మీకు పుణ్యముంటుంది. మీ కాళ్ళు పట్టుకుంటాను. మీ మేలు మర్చిపోను. మీ కడుపులో పుడతా, బాబూ"

"చాలు!"

ముందుకు నడిచాను.

వెంటబడ్డాడు.

ఆగాను.

అణాకోసం చెయ్యి చాపాడు.

లోతుకుపోయిన కళ్ళల్లో ఆశ—

పాలిపోయిన పెదవులమీద హాసం—

వాడిపోయిన వదనంలో విషాదం—

మనసులో సరిగ్గా లక్ష ప్రశ్నలు!

విషసర్పాల్లా బుసకొట్టి భయపెట్టాయి. తప్పించుకోవా లనుకున్నాను. నాగస్వరంలాంటి తర్కంతో జోకొట్టాలనుకున్నాను. ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. బుసకొట్టి కాటేశాయి. బాధతో విలవిలలాడిపోయాను.

ఆ బాధలో—

మానవత్వం మరుగుపడింది.

బిచ్చగాణ్ణి పీడించి ఆనందించాలన్న రాక్షసమైన కోరిక హృదయంలో ప్రళయ నృత్యం చేసింది.

"ఒక్క అణా చాలా?"

"చాలు బాబూ!"

"ఏ మొస్తుంది?"

"టీ!"

"రేపు!"

"ధర్మ పెబువులు ఎవరో రేపూ యిస్తాను బాబూ!"

హృదయం మొలికలు తిరిగి విరిగిపోయింది

జీవితంమీద నాకు లేని లాలస వానికుందని యీర్ష్య!

నాలో లేని ఆశ వానిలో ఉందని కుళ్ళు!

నాలో లేని సంతృప్తి వానిలో ఉందని బాధ!

తీక్ష్ణంగా వాని కళ్ళల్లోకి చూశాను. ఆ కళ్ళల్లోని భావాలన్నీ ఆకళింపు చేసుకోవాలని పిచ్చి ప్రయత్నం చేశాను.

"అలా ఎన్ని రోజులు?"

"బతికినన్నాళ్ళు."

"అలాంటి బ్రతుకు బ్రతకడ్ం దేనికి?"

తెల్లపోయి చూచాడు. మరుక్షణంలోనే తేరుకున్నాడు.

"బతక్క చస్తామా బాబూ?!"

"చ సేమటు కేం?"

"పుట్టాక బతకాలిగా?"

"అడుక్కుతిన్నా?"

క్రూరమైన నా నవ్వులో రాక్షసత్వం తొంగి చూచింది. ఆ వికటాట్టహాసపు వికృత ధ్వనులు బిచ్చగాని గుండెలను ప్రయ్యలుచేశాయి.

లోతుకుపోయిన బిచ్చగాని కళ్ళల్లో, గుండెల్లోని బాధ మారుమోగింది.

జీవితంలో ఏం సాధించలేని నేను—

బ్రతకలేక చావలేక

చచ్చేవాళ్ళను సాధించి సంతృప్తి చెందాలని—
ఆకలి బ్రతుకులతో ఆటలాడి
ఆనందించాలని—ఆ ఆనందంలో,
సంతృప్తిలో, ద్వేషాన్ని,
కర్కశత్వాన్ని
కప్పిపుచ్చాలని—
ప్రయత్నించి—
విఫలుణ్ణయి—
వలవల
విలపించాను.

అంతలో ఆ కేళ్ళు దాటని ఓ అబ్బాయి బిచ్చగాని దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

ఒక్కసారి చూస్తే కలలోకి వచ్చేటంతటి అసహ్యంగా, భయంకరంగా ఉన్నాడు.

"వీణ్ణి చూసన్నా అణా యివ్వండి బాబూ!"

"ఏమౌతాడు?"

కంఠం కంపించింది.

కళ్ళు చెమ్మగిల్లాయి.

"కొడుకు—వీడికోసమే బాబూ యింత కష్టం."

జేబులో ఉన్న అర్థరూపాయి బిళ్ళతీసి వాడి చేతిలో పెట్టాను. వాడి కళ్ళలో—

ఎంత కాంతి!
ఎంత తృప్తి!
ఎంత సంతోషం!
రెండు చేతులెత్తి దణ్ణం పెట్టాడు.

హృదయపూర్వకంగా ఆశీర్వదించాడు.

ఎందుకు?

ప్రాణం నిలిపానని.

కానీ బ్రతుకంటే ఎందుకంత ఆశ?

దానిమీద ఎందుకంత మోజు?

చేదులాంటి జీవితంపై ఎందుకంత తీపి?

అదే అర్థంకాని ప్రశ్న!

జీవితంమీద వాడికున్న ఆశలో, మోజుల్లో, తీపిల్లో, ప్రాకులాటలో, ఆరాటంలో, నూరోవంతయినా నాలో ఉంటే ఎంత బావుణ్ణు!

సామాన్యులైనవాళ్ళంతా ఎందుకు బ్రతుకుతున్నారు? బ్రతుకోసం ఎందుకలా ప్రాకులాడుతున్నారు? వాళ్ళ దారంట నేనూ పోతేనేం?

నిశ్చింతగా, నిర్లిప్తంగా,
నలిగిన బాటలో నడిచిపోవడంలో
ఎంత తృప్తి, ఎంత ఆనందం ఉన్నాయి!
భారహృదయం తేలికైంది.

ఆ రోజు——

అర్థరూపాయతో తెలుసుకున్న విషయం కోటి రూపాయల విలువను మించింది. జీవితానికి అర్థం చెప్పింది! ఆశలు రేపింది. అనురాగం నింపింది.

"ఆ రోజు" నెలా మరిచిపోను?

ఉంటాను.

నీ
రాఘవ."

# రంగుటద్దాలు

డియర్ పద్మా!

నీ కుత్తరం వ్రాసి యిప్పటికి సరిగ్గా సంవత్సరం పైగా అయిందనుకుంటాను. నీ పెళ్ళికి రమ్మని రాశావు. రాలేనంటూ వుత్తరం రాశాను కదూ! తర్వాత ఎన్నో సార్లు నీకు వుత్తరం వ్రాయాలనుకున్నాను. కానీ రాయడం పడలేదు. పద్మా! నీకు గుర్తుందో లేదో మన పరిచయమైన తొలిరోజుల్లో "నీ కళ్ళెప్పుడూ కలలు గంటూ ఎక్కడికో తేలిపోతుంటాయి రుక్కూ!" అన్నావు. గుర్తుందా? ఆరోజు నే నిచ్చిన జవాబేమిటి? 'నా ఆశల విమానాల్లో—నా ఆశయసౌధాల్లోకి తేలిపోతుంటాయి!' అన్నాను కదూ? ఈ రోజు నా ఆశల విమానాలను తుపాకుల్తో నిర్దయగా కాల్చేశారు. నా ఆశయ సౌధాలు నా అందుబాటులో లేవు. ఈరోజు నాకళ్ళల్లో నీవు చూసిన కలలు లేవు పద్మా? బహుశః ఈరోజు నన్ను చూసినా నువ్వు గుర్తు పట్టలేవేమో! ప్రపంచంలోని నిరాశా—నిలం నన్ను దహించివేస్తుంది. నా ఎమ్. ఎ. ఎయ్ఇడి డిగ్రీ మాటమాటికీ గుర్తుకొచ్చి నన్ను వెక్కిరిస్తుంది. ఈ విశాల ప్రపంచంలో ఎంత వెతికి చూసినా నన్ను సానుభూతితో అర్థం చేసుకోగల స్నేహితురాలవు నువ్వో

క్కడానివే కనిపిస్తున్నావు. శుక్రవారం మెయిల్లో వస్తు న్నాను. స్టేషను కొస్తావు కదూ?

నీ

'రుక్కు'

ఉత్తరం మడిచి టేబిలు మీద పెట్టి బరువుగా నిట్టూ ర్చాను. నాకు తెలియకుండానే కళ్ళు చెమర్చాయి. రుక్కు సుందర విగ్రహం, కలలు గనే. కళ్ళు కళ్ళముందు మెదిలాయి. "ఎక్కణ్ణుంచి వుత్తరం?" అప్పుడే హాల్లో కొచ్చిన అక్కయ్య అడిగింది.

"రుక్మిణీ దగ్గరినుంచి"

"ఏ రుక్మిణి? నీ రుక్కా?" అక్కయ్య కళ్ళు నవ్వు తున్నాయి.

"ఊఁ........"

"ఏమిటి విశేషాలు?"

నా కెదురు కుర్చీలో కూర్చుంటూ అడిగింది అక్కయ్య.

"చెప్పను! నాచేతకాదు! చదువుకో"

అక్కయ్య ఓ నిముషంలో జాబు చదివి టేబిలు మీద పడేస్తూ సన్నగా నవ్వింది.

"ఎందుకూ?" కనుబొమలు మడిచి అక్కయ్య కేసి చూస్తూ విసుగ్గా అన్నాను.

"యీ మధ్య చదువుకున్నవాళ్ళకంతా యిదో జబ్బు పట్టుకుంటుంది.! దీనికి మరో మందులేదు. త్వరగా

పెళ్ళి చేసుకోడమే!" క్రీగంట నావైపు చూస్తూ అంది అక్కయ్య.

"రమా!" బాధగా అన్నాను.

"ఏమిటో కానీండి!" రమ పెద్దగా నవ్వింది.

"రుక్మిణిని తప్పుగా అర్థం చేసుకొన్నావు."

"బి. ఎ. లో నా మెయినేమిటో తెలుసా?" మోచేతుల్లో గడ్డం పెట్టుకుని నాకేసి చురుగ్గా చూస్తూ అంది రమ.

నేను నవ్వాను.

"నువ్వు నవ్వినా నాకేం చిన్నతనంలేదు. ఇంతెందుకు రేపు సాయంత్రానికల్లా రుక్మిణి వస్తుంది. రుక్మిణి నోటిగుండానే చెప్పిస్తాను!"

బల్లగుద్ది అంది అక్కయ్య.

"ఏమని?"

యిదంతా భగ్నప్రేమ తాలూకు నిరాశని!"

అంత బాధలోను నాకు నవ్వొచ్చింది.

"సరే! అలాగే చెప్పిస్తువుగాన్లే!"

"మీ శ్రీవారు గాబోలు పిలుస్తున్నట్లుంది!"

ఉత్తరం తీసి డ్రాయరులో పెట్టి మేడమీద కెళ్ళాను.

## 2

ప్లాట్‌ఫారమ్ టికెట్టుకొని లోపలికెళ్ళగానే ట్రెయిను అరగంట లేటని అనుకుంటున్నారు ప్రయా

ణీసులు. ఏమీతోచక యింగ్లీషు పత్రి కొకటికొని తిర గెయ్యసాగాను. రుక్మిణి కథొకటుంది. చదువుకొనే రోజుల్లో రుక్మిణి కథలు వ్రాస్తుండేది. తెలుగులోకన్నా యింగ్లీషులో వ్రాసేందుకు రుక్మిణి ఎక్కువ యిష్టపడేది. రెండు మూడు యింగ్లీషు కథలు అచ్చయ్యాయి. అయితే ఆ కథల్లో రుక్మిణికలలే ఎక్కువగా కనిపిస్తుండేవి. పుస్తకం తీసుకుని లేడీస్ వెయిటింగ్ రూంలోకి వెళ్ళి కథచదవడం పూర్తి చేశాను. నన్నెక్కువ ఆశ్చర్యపరిచింది ఆరోజు రుక్మిణి కన్నకలలు. ఆశయాలు, అనన్యమైన రుక్మిణి ఆశా వాదము యీ కథలోకూడా కనిపించడమే!

ప్రపంచంలోని నిరాశంతా తనకు దహించి వేస్తుం దన్న రుక్మిణేనా యిది వ్రాసింది?

సాటిలేని తన ఆశావాదంతో నూతనోత్సాహాన్ని స్తున్న రుక్మిణి నిరాశా నిస్పృహల్లో మలమల మాడిపోవల సిందేనా? ఎందుకు రుక్మిణి ఇలాగ మారింది? అక్కయ్య న్నట్లు భగ్నప్రేమ కాదుగదా? గుండె దడదడ కొట్టు కుంది. దూరంలో ఎక్కడో రైలుకూత కూసింది.

పుస్తకం చేత్తో పట్టుకుని ప్లాట్‌ఫామ్‌మీద కొచ్చాను.

రెండు నిముషాల్లో రైలువచ్చి ప్లాట్‌ఫామ్‌మీద ఆగింది.

నాకళ్ళు ఆత్రంగా రుక్మిణికోసం వెతికాయి.

“పద్మా”

ముందుకు చూశాను. సెకండ్ క్లాస్ కంపార్ట్

మెంటుదిగి సూట్‌కేసుతో నిలుచున్నది రుక్మిణి. సంతోషంతో రుక్మిణివైపుగా నడిచాను. ఎంతమార్పు! అద్దాలేసుకోవడంవల్ల మనిషి పూర్తిగా మారినట్లు కనిపించింది నాకు.

"చాలా మారిపోయావు రుక్కూ!"

రుక్మిణి చేతిని నా చేతిలోకి ఆప్యాయంగా తీసుకుంటూ అన్నాను.

"నీ కన్నానా ?"

"నే మారానా ? కాస్త లావెక్కాననుకో !"

"నేనూ కాస్త చిక్కాననుకో !"

యిద్దరం నవ్వాము.

"ఏమిటి విశేషాలు ? ఆ వుత్తరమేమిటి ? హడలిపోయాను సుమా ?"

రుక్మిణి ఓ క్షణం నాకేసి చూసి చూపు ఇంకోకవైపు తిప్పుకుంది.

రుక్మిణి చెప్పింది నిజం! కలల్లో తేలిపోతున్న ఆ కళ్ళు ఇప్పుడు బాధతో బరువుతో వాలిపోతున్నాయి. పచ్చని ఒంటిరంగు కాస్తనలుపు తిరిగింది. నల్లని జుట్టులో అక్కడొకటి అక్కడొకటి తెల్లని వెంట్రుక కనిపిస్తుంది.

"ఏమిటలా చూస్తావ్? మింగేస్తావా?" నేను నవ్వి బయటకు దారితీశాను. వాకిట్లోనే చిరునవ్వుతో స్వాగతం చెప్పింది అక్కయ్య.

"చాలా మారావు సుమా !"

కాఫీ కప్పులు టేబిలుమీద పెడ్తూ అంది అక్కయ్య.

"మార్పు సహజమే గదండీ!"

హేలగా నవ్వి అంది రుక్మిణి.

రుక్మిణి కంఠంలోని బాధలనుడులు నా గుండెల్ని బ్రద్దలు చేశాయి.

"ముందు కాఫీ తీసుకో రుక్కూ! తర్వాత మాట్లాడుకోవచ్చు"

కాఫీ కప్పు చేతిలోకి తీసుకుంటూ అన్నాను. అక్కయ్య నే తెచ్చిన పత్రిక తిరగేస్తూ రుక్మిణిని పరీక్షగా చూసింది. ఆ నఖశిఖ పరీక్షకు రుక్మిణి కాస్త విసుక్కున్నట్టే కనిపించింది.

"రమా! రేపటినించి ఓ అరకప్పు కాఫీలో ఓ అర కప్పు 'ఆశీర్వాదాన్ని' కలిపి యిస్తుండు! లేకుంటే రుక్మిణి యిప్పుడిప్పుడే కోలుకొనేటట్లు కనిపించడంలేదు!" అక్కయ్య దృష్టిని నావైపు తిప్పుకొనేందుగ్గాను అన్నాను.

అక్కయ్య నవ్వి తలూపింది.

"పాపం! ఎన్నాళ్ళకో కలుసుకున్నారు ప్రాణ స్నేహితులు! మాట్లాడుకోండి! వంట ఎంతవరకయిందో చూస్తా" అంటూ లోపలికెళ్ళింది.

"రుక్కూ!"

"ఊఁ..."

"చూడు. ఎమ్. ఎ. ఎమ్. ఇడి. పూర్తిచేశావు. ప్రిన్సిపాల్‌గా పని చేస్తున్నావు. నలుగురు యీర్ష్య చెందే టటువంటి స్థానంలో యీరోజున్నావు. ప్రపంచంలోని

నిరాశంతా నిన్ను దహించి వెయ్యవలసినంత అవసరమే మొచ్చింది రుక్కూ ?" పాలిపోయిన రుక్మిణి ముఖంకేసి చూస్తూ అన్నాను.

"నా నిరాశా నిస్పృహలకు జీవిత వైరాగ్యానికి కారణాలు చెప్పమంటే నా చేతకాదు పద్మా! బహుశః నా చదువే ఇందుకు కారణమేమో!"

కిటికీలోనుండి ఎటో సుదూర లోకాల్లోనికి చూస్తూ అంది రుక్మిణి.

నేను గతుక్కుమన్నాను.

వాకిట్లో బూట్లు చప్పుడయింది.

"మా శ్రీవారు రుక్కూ!"

"నమస్తే!"

"ఈవిడ తెలుసుగా?"

"తెలీక పోవడమేంటి? నీ డియరెస్టు ఫ్రెండ్! రుక్మిణిగారు...కాలేజీలో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నారు. ప్రయాణం కులాసాగా సాగిందాండి!" నవ్వుతూ రుక్మిణి వైపు చూసి అన్నారు.

రుక్మిణి తలూపింది.

నాకు నవ్వొచ్చింది.

"మీ కథలు రెండుమూడు చదివాను. ఇంకాస్త పరిశ్రమ చేస్తే కథారచయితగా బాగా రాణించగలరు."

బూట్లు విప్పుకుంటూ అన్నారాయన.

"శ్రమ పడాలని లేదు." నిరాశా గానం రుక్మిణి కంఠంలోనుండి లీలగా వినిపించింది. ఆయన తలెత్తి ఆశ్చ

ర్యంగా రుక్మిణి ముఖంలోకి చూసి మళ్ళీ బూట్లు విప్పుకో సాగారు.

లోపలికెళ్ళి కాఫీ తెచ్చి టేబిలుమీద పెట్టాను.

కాఫీ త్రాగి బాత్ తీసుకొని ఓ గంటలో వస్తానంటూ బైటకెళ్ళారు.

అక్కయ్య వచ్చి రుక్మిణి కెదురుగా కుర్చీలో కూర్చుంది.

తన అర్థంలేని ప్రశ్నలతో రుక్మిణి మనసును బాధ పెడుతుందేమోనని నా గుండె దడదడలాడుతూంది. "ఏం మాట్లాడాలో - ఎలా మాట్లాడాలో తెలీక కొండల్లోకి వెళ్తున్న సూర్యునివైపు చూస్తూ కిటికీదగ్గరే నిల్చున్నాను.

కాని రాగం తీసుకుంటూ రత్తి లోపలికొచ్చి- ఒళ్ళోఉన్న సన్నజాజిపూలు టేబిలుమీద గుమ్మరించింది.

"ఇంత ఆలస్యమైందేం ? యిప్పటిదాకా ఏం చేస్తున్నావ్ ?" అక్కయ్య గద్దించింది.

"రికార్డులు పెడుతుంటే వింటున్నాను. కొత్త కొత్త పాటలు ! మొన్న మనం వెళ్ళలేదమ్మగోరూ !...కొత్త సినిమా..." రత్తి ఉత్సాహంతో చెప్పుకుపోతూంది.

"చాల్లే ! కాఫీగ్లాసులు వేసున్నాయి. వెళ్ళితోము."

రత్తి తమాషాగా నవ్వుకుంటూ లోపలికి పరిగెత్తింది.

"రత్తిని చూస్తుంటే నాకు అసూయ కలుగుతూంది. ఎంత సంతోషంగా ఉంది !"

బరువుగా నిట్టూర్చి అంది రుక్మిణి.

"నిన్నమటుకు అంత సంతోషంగా ఎవరుండ వద్దన్నారు?"

అక్కయ్య నవ్వుతూ అంది.

"ఎలావుండను? తెచ్చిపెట్టుకున్న సంతోషం ఎంతసేపుంటుంది?"

నేను మెల్లిగా వెళ్ళి రుక్మిణిప్రక్కగా కూర్చున్నాను. అక్కయ్య దారంతెచ్చి పూలు అల్లుతూంది. రుక్మిణి ఫ్లవర్ వాజ్ వేపు పరీక్షగా చూస్తూంది.

"పిచ్చిపిచ్చి వూహాల్తో మనసు పాడుచేసుకోకు రుక్కూ!" రుక్మిణి చెయ్యి నా చేతిలోకి తీసుకొని ప్రార్థనా పూర్వకంగా అన్నాను.

రుక్మిణి అదోరకంగా నవ్వింది.

అక్కయ్య పూలు కట్టడం ఆపి రుక్మిణికేసి చూస్తూ-

"రుక్మిణీ! నే నొకమాట చెప్తాను. ఏమనుకోవుగదూ?" అంది.

"అనుకొనేదేముంది? చెప్పండి!"

"నీకు చెప్పేపాటిదాన్ని నేను కాననుకో! నాకు పద్మ ఎలాంటిదో నువ్వూ అలాంటిదానివే రుక్మిణీ! అందుకే చెప్పాల్నొస్తుంది. చూడు- మనం చూసే సినిమాల్లాగ - చదివే నవల్లాగ - లేక నువ్వురాసే కథల్లాగ నిత్య జీవితం వుండదు రుక్మిణీ!"

రుక్మిణి ఔనన్నట్లు తలూపింది.

"ప్రతివ్యక్తికి కొన్ని ఆదర్శాలుంటాయి. కాదనను. అయితే ఎల్లకాలం నీ ఆశయ సౌధాల్లో కలలుగంటూ గడపలేవు.

దురదృష్టవశాత్తూ భూమ్మీద నడవాలిసివస్తుంది. నీ ఊహాలోకానికి - ఈ లోకానికి మధ్యనున్న అఘాతం లాంటి భేదం నగ్నంగా కళ్ళముందు కనబడగానే గిజగిజ లాడతావు ప్రత్యేకంగా కవితాహృదయం కల్గిన నీ బాధ వర్ణనాతీతం! నువ్వెంత బాధపడుతున్నావో నాకు తెలుసు రుక్మిణి!"

అక్కయ్య ఆగి రుక్మిణి ముఖవైఖరిని గమనించ సాగింది. తలవంచుకుని పొడవాటి వ్రేళ్ళతో టేబిలుమీద పిచ్చిగీతలు గీస్తున్న రుక్మిణి అక్కయ్య మాట్లాడ్డం ఆపగానే తలెత్తి చూసి-

"ఊ...కానీండి!" అని మళ్ళీ తన పనిలో మునిగి పోయింది. అక్కయ్య నావైపు చూసింది పూర్తిచెయ్యనా అన్నట్లుగా. నేను అంగీకారసూచనగా తలూపాను.

"ఇంట్లో ఎలుకలున్నాయని యింటికి నిప్పు పెట్టు కుంటామా రుక్మిణీ! నీ ఆదర్శపూరితమైన ఊహాలోకా నికీ జీవితానికీ పోలికేలేదని జీవించడమే మానుకోవడం అవివేకంకాదూ? నువ్వు కన్నకలలు కరిగిపోయి వుండ వచ్చు. నీ ఆశయసౌధాలు కూలిపోయి ఉండవచ్చు. మళ్ళీ వినూత్న ఆశయసౌధాలు కట్టుకో..."

"నాలో యింక శక్తిలేదు" తలొంచుకునే గొణిగింది రుక్మిణి.

"రుక్కూ! ఏం మాటలవి" నెమ్మదిగా మందలించాను.

"అవును పద్మా! ఈరోజు నేను బ్రతుకుతున్నానంటే అది అమ్మకోసమే! జీవితంమీద మోజు ఏరోజో తీరిపోయింది" బాధగా అంది రుక్మిణి.

"నీ ఆశలకు, ఆశయాలకు అనుగుణంగా జీవితాన్ని మార్చుకొనేందుకు ప్రయత్నించాలిగానీ."

"అదీ అయింది" నిట్టూర్చి అంది రుక్మిణి.

"రోడ్డంతా గతుకులమయమని ప్రయాణం మానుకుంటామా? ఎన్నో కష్టనష్టాల కోర్చి ప్రయాణం సాగిస్తేనే ఊరు చేరుకొంటాము. రోడ్డు బాగాలేదని అక్కడే కూర్చోవడం పిరికిపందల లక్షణం. నువ్వు హృదయాన్నిచ్చినా, కఠినాత్ముడెవడో నిరాకరించి వుండవచ్చు! అంతేనా?"

"లేదు లేదు. అలాంటి తెలివితక్కువ పని నేను చెయ్యలేదు" విసుగ్గా తలెత్తి అంది రుక్మిణి.

నేను అక్కయ్యవైపు సగర్వంగా చూశాను. తొందరెందుకూ కాసేపు ఆగు అన్నట్లు చూసింది అక్కయ్య.

"బహుశః నువ్వు ఊహించుకొన్న నీ కథానాయకుడు ఈ లోకంలో లేకపోవచ్చు......"

"అంటే?" రుక్మిణిగొంతు తీవ్రంగా వుంది.

నేను కంగారుగా అక్కయ్య ముఖంలోకి చూశాను.

"అంటే ఏంలేదు. సద్గుణసంపన్నుడు, కవి, చిత్రకారుడు, గాయకుడు, యింకా యింకా...అంటే మానవ

లక్షణాలు లేకుండా ఏ దేవతావరప్రసాదమో అయినట్టి వాడు తరచుగా మనకు కనిపించడు"

"ఊఁ......అయితే?"

రుక్మిణి పిచ్చిగీతలు గియ్యడం మానేసి అక్కయ్య కేసి ప్రశ్నార్థకంగా చూసింది.

"అంటే నీకథల్లోలాంటి కథానాయకుడు కనిపించక, కనిపించినా అందుబాటులో లేక......"

"పొరపడ్డారని చెప్పేందుకు విచారిస్తున్నాను"

రుక్మిణిగొంతులో కాఠిన్యం కదలాడింది.

"కాదు రుక్కూ! నువ్వు కలలుగన్నంతటి మంచి తనం ఈ లోకంలో లేకపోవచ్చు. అలాగని జీవన కుసుమాన్ని చేజేతులా నలిపేసుకుంటారా ? చదువుకొనే రోజుల్లో అబ్బ! ఎంత చురుగ్గా చలాకీగా తిరుగుతుండే దానివి! అప్పుడు జీవన ప్రవాహమే నీ రూపంలో సాక్షాత్కరించిదేమో ననుకునేదాన్ని !"

బాధగా అన్నాను.

"ఆ రోజులు వేరు పద్మా! నా ఆశయాల కోసమే బ్రతుకుతుండేదాన్ని. పెద్దపెద్ద చదువులు చదివి డిగ్రీలు తీసుకోవాలనీ, లోకాన్నంతా మరమ్మత్తు చేయాలనీ, ఏమో ఏమో అయిపోవాలని-ఏమిటో పిచ్చిపిచ్చి ఆలోచనలు......నా ఆలోచనలకు నాకే నవ్వొచ్చేది...స్వచ్ఛమైన ఆనందాన్ని ఇవ్వలేని ఈ డిగ్రీలు ఎందుకు పద్మా? చెప్తే నమ్మవుగానీ—ఈ రోజు నేను బాధపడేది విచారించేది ఒకే ఒక విషయానికి! ఎందుకు చదువు కున్నానా

అని! ఒక్కో డిగ్రి ఎక్కేకొద్దీ అర్థంగాని మనుషులతో, తీరని సమస్యలతో, అందుకోలేని ఆదర్శాలతో జీవితం దుస్తరమైపోతుంది. నేనూ రత్తిలాగ వుంటే!...అబ్బ!... ఎందుకు పుట్టాం? మన జీవనగమ్యమేమిటి? మృత్యువెందు కొస్తుంది? విరుద్ధమైన జీవనగమ్యాలను ఏర్పరచడంలో భగవంతుని ఉద్దేశ్యమేంటి? అసలు భగవంతుడున్నాడా? వుంటే ఎక్కడుంటాడు? ఎలా వుంటాడు? మన కగ్గని పిస్తాడా? ఇలా మనల్ని కీలుబొమ్మల్ని చేసి ఆడించడంలో అతని కానందం కల్గుతుందా?— ఇలాంటి అర్థంలేని ప్రశ్నలు రత్తి నే రోజన్నా బాధిస్తాయా పద్మా?"

రుక్మిణి సజలనయనాలు బాధతో గిలగిలలాడు తున్నాయి.

"రత్తినే కాదు రుక్మిణీ! అలాంటి అర్థంలేని ప్రశ్నలు నన్నుగూడా బాధించవు. ఇంకా చెప్పాలంటే పద్మను గూడా బాధించవేమో! జీవనప్రవాహంలో మునిగితేలే మాకు అలాంటి అర్థంలేని వ్యర్థ ప్రశ్నలను, సమస్యలను గురించి ఆలోచించేటందుకు సమయమేదీ? నా నలుగురి పిల్లల్ని గురించి ఆలోచించనే నాకు సరిగ్గా సమయంలేదు" సన్నగా నవ్వుతూ అంది అక్కయ్య. అక్కయ్య వ్రేళ్ళు చక చకా పూలదండ అల్లేస్తున్నాయి.

రుక్మిణి కిటికీలోనుండి దూరంగావున్న కొండలవైపు చూస్తోంది. బహుశః అక్కయ్య చెప్పిన మాటల్లోని

సత్యాన్ని గురించి ఆలోచిస్తుందేమో. అదే మంచి తరుణమని నేను గొంతు సవరించుకొన్నాను.

"అవును రుక్కూ! అక్కయ్య చెప్పింది ఒకవిధంగా నిజమే ననిపిస్తుంది. ఏదో ఒక లక్ష్యాన్ని పెట్టుకో! అప్పుడు జీవితంలో ఇంత నిరాశ వుండదు. ఆ గమ్యాన్ని చేరుకొనే పోరాటంలో నిరాశా నిస్పృహలకంతగా తావుండదేమో"

రుక్మిణి నావైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"పెద్దదాన్ని చిన్నదాన్ని చెబుతాను. నా మాట విని పెళ్ళి చేసుకో! అప్పుడు భర్త, బిడ్డలు, సంసారం అన్న తాపత్రయం ఏర్పడుతుంది. ఇలాంటి పిచ్చి ఆలోచనలకు నీకు తీరికేవుండదు."

అక్కయ్య రుక్మిణి ముఖంలోకి చూస్తూ అంది.

"నన్ను మీరెవ్వరూ అర్థం చేసుకోలేరు" గద్గద కంఠంతో అంది రుక్మిణి.

"పోనీ రుక్కూ! గొప్ప రచయిత్రివి కావాలని నీ లక్ష్యంగా ఎందుకు పెట్టుకోరాదు ?"

"రచయిత్రినా? ఎందుకు? దానివల్ల లాభమేమిటి?"

దానికేం జవాబు చెప్పను ? ఓ నిముషంసేపు నాలు గ్గోడలవంకా చూశాను జవాబు తోచక !

"ఎందుకేమిటి? అందరు ఎందుకు రాస్తారు?" జవాబు చెప్పడం చేతగాక ఎదురు ప్రశ్న వేశాను.

'అందరి సంగతి అటుంచు – నా రచనలవల్ల పిల్లేమన్నా మారుతారా? ఎందుకు లేనిపోని ప్రయాస పడ్డాం?"

"అదే వద్దన్నది. మారరని ఎందుకనుకోవాలి? పోనీ వాళ్ళు మారకున్నా తాత్కాలికంగానన్నా ఆనందాన్నిస్తున్నారు కదా" చిరుకోపంతో అంది అక్కయ్య.

"అర్థం పర్థంలేని ఆ క్షణికానందాన్ని ఇచ్చేందుకు నా జీవితాన్ని బలిగా ఇవ్వాలా? ఇంతకుముందంటే లేని వుత్సాహాన్ని తెచ్చుకుని ఏవో పిచ్చిగీతలు గీలుకుతుండే దాన్ని. ఇంక రాయదలచుకోలేదు" మోచేతుల్లో తలను దాచుకుని బరువుగా అంది రుక్మిణి.

"పోనీ అర్థం కలదాన్ని – నీ కానందాన్నిచ్చే మరో లక్ష్యాన్ని ఎన్నుకో రుక్కూ!" ఆశగా రుక్మిణి కన్నుల్లోకి చూస్తూ అన్నాను.

"ఏముంది? అంతా మిథ్య! దేనికోసం ఇంక నేను ప్రాకులాడలేను పద్మా!" చీకటి తెరలు క్రమ్ముకొంటున్నాయి నేను లేచి లైటు వేశాను.

అక్కయ్య జాజిదండ కట్టడం పూర్తిచేసి మూడు మాలలుగా చేసి నాకోటీ రుక్మిణికోటీ ఇచ్చి తనొకటి తీసుకుంది.

రత్తి అంట్లు తోమడం పూర్తిచేసి కాని రాగం తీసుకుంటూ హాల్లో కొచ్చింది.

"వెళ్తా నమ్మగోరూ!" అంది మా ముగ్గురివైపు చూస్తూ.

"రత్తీ! ఇలా రా!" రుక్మిణి పిల్చింది.

రత్తి టేబిలు దగ్గరగా వచ్చింది.

"ఈ పూలు పెట్టుకో."

"నేనిస్తా నువ్వు పెట్టుకో రుక్మిణీ!" అంది అక్కయ్య.

"కాదు. ఇవి రత్తి తల్లోవుంటే, రత్తిలాగ కిలకిల నవ్వుతాయి. పెట్టుకో రత్తీ!"

రత్తి నావైపు చూసింది.

"తీసుకో" నవ్వుతూ అన్నాను.

రత్తి పూలు తీసుకుని ఛంగున లేడిపిల్లలా పారిపోయింది!

రుక్మిణి కన్నార్పకుండా రత్తి పోయినవైపే చూస్తూంది.

"సంతోషంగా వుండాలన్నా పెట్టిపుట్టాలి పద్మా! కాదంటావా?" సాలోచనగా అంది రుక్మిణి.

నే తలూపకుండా వుండలేకపోయాను.

# 3

ఓ వారంరోజులు గడిచిపొయ్యాయి. అక్కయ్య ఎనలేని వుత్సాహంగానీ, నా నిరంతర బోధనలు గానీ రుక్మిణిని పిసమంతయినా మార్చలేకపోయాయి. రుక్మిణి పరధ్యానాన్ని మరోవిధంగా భావించి వారప్పుడప్పుడూ తమాషాగా ఏమన్నా అన్నా, రుక్మిణి ఏం పట్టించుకునేది గాదు. సన్నగానవ్వి ఎటో చూస్తూ వుండిపోయేది. రుక్మిణి యింక మారదేమోనన్న ఆలోచన కలగగానే—నిలువెల్లా కంపించిపోయేదాన్ని.

ఓరోజు మధ్యాహ్నం కాఫీ తీసుకొనే సమయంలో రుక్మిణికి టెలిగ్రామొచ్చింది.

"మదర్ సీరియస్! స్టార్ట్ యిమీడియేట్లీ" అని వుంది.

"వెళ్ళాలి" కన్నీటి పొరగుండా నావైపు చూసి అంది.

"ఇప్పుడెలా వెళ్తావ్? ఏ బండీ లేదే" ఆత్రంగా అన్నాను.

"వేకువన నాలుగ్గంటల కో బండీ వుంది. దాని కెళ్ళాల్సిందే" అంది అక్కయ్య.

"బయల్దేరేటప్పుడు అమ్మకేమన్నా జబ్బుగా వుందా?"

"లేదు. అప్పుడప్పుడూ గుండెనొప్పి అంటుంది"

గదిలోకివెళ్ళి తన బట్టలన్నీ సర్దుకుని బయల్దేరింది.

"రుక్కూ! ఏమిటది? ఇప్పుడెలా వెళ్తావ్? ఏ బండీ లేదు" వచ్చే ఏడ్పును మింగి అన్నాను.

"అలాగా" రుక్మిణిచూపులు పిచ్చిగా వున్నాయి.

అక్కయ్య చిత్రంగా నాకేసి కళ్ళల్లోకి చూసింది.

"ఉదయం ఇద్దరం వెళ్దాం. నేనూ వస్తాగా" అతి కష్టంమీద రుక్మిణి నెలాగో ఆపగలిగాను.

ఏ అపరాత్రో, సూట్ కేసు చేతబట్టుకొని వెళ్తుందేమోనని ఆ రాత్రంతా రుక్మిణికి కాపలా కాశాను. ఎంత

సేపు బ్రతిమాలినా పండుకోలేదు. ఆకాశంలోని నక్షత్రాల వంక చూస్తూ కిటికీదగ్గర నిల్చుంది.

ఆ రాత్రంతా ఇద్దరం జాగారం చేశాం. అక్కయ్య వద్దనడంచేత నేను రుక్మిణితో వెళ్ళలేకపోయాను.

రావడం లేదేమని రుక్మిణి అడగనూ లేదు.

ఇద్దరం కలిసి స్టేషను కెళ్ళాము.

"వెళ్ళగానే అమ్మ కెలా వుండేది జాబురాయి" అన్నాను. రైలుకూతలో రుక్మిణి జవాబు వినిపించలేదు.

రుక్మిణిని తీసుకొని రైలు మెల్లిగా కదిలిపోయింది.

# 4

రుక్మిణివెళ్ళి నెలరోజు లయిపోయింది. ప్రతిరోజూ రుక్మిణి దగ్గర్నించి జాబుకోసం ఎదురుచూడ్డమే! జాబు వ్రాసేవిషయంలో రుక్మిణి ఎంత సోమరో తెలిసినా జాబు కోసం ఎదురుచూడకుండా వుండలేకపోయాను. పోస్టుమన్ వుత్తరంలేదని చెప్తే అతనిమీద కలిగే కోపం అంతా యింతా కాదు! ఓ అరగంటసేపు కుర్చీలో కూర్చుని ఆ కోపాన్నంతా మెల్లిగా రుక్మిణిమీదకు మళ్ళించేదాన్ని! నేను చిరాగ్గా వుండడంచూసి అక్కయ్య నవ్వుకునేది. ఇక రుక్మిణి దగ్గరనుండి వుత్తరం రాదని ఆశ నిరాశ చేసుకొన్నాను. తర్వాత పదిరోజులకు ఓ రోజు నేనతన్ని అడక్కపోయినా

పోస్టుమన్ ఉత్తరం తెచ్చి నా చేతిలో పెట్టాడు. కవరు చింపి ఆత్రంగా జాబు చదివాను.

డియర్ పద్మా!

రాత్రి ఆకాశంలోని చుక్కల్ని లెక్కపెడుతుంటే ఎందుకనో చటుక్కున నువ్వు గుర్తొచ్చావు. ఉదయాన్నే ఈ జాబు రాస్తున్నాను. అమ్మ ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయింది పద్మా! కాగితం పువ్వులాంటి ఈ జీవితం నన్నాకర్షించలేకపోయింది. ఈరోజు నేను బుద్ధగయలో వున్నానంటే నువ్వు ఆశ్చర్యపడవనుకుంటా పద్మా! జీవితంలో ప్రశాంతత అంటే ఏమిటో నాకీ రోజు తెలుస్తూంది. నీ అనురాగాన్ని ఆప్యాయతని ఏ రోజు మర్చిపోలేను. సెలవు.

నీ

'రుక్కు'

చదివింది అర్థంకాక మళ్ళీమళ్ళీ చదువుకున్నాను. నాకు తెలియకుండానే కళ్ళు చెమ్మగిల్లాయి. పెరట్లో మల్లె మొగ్గలు కోస్తున్న అక్కయ్యదగ్గరకు పరిగెత్తాను.

"ఏమిటి పద్మా?"

"రుక్కు బుద్ధగయకు వెళ్ళిపోయిందట!"

"కవర్డ్! నే నేనాడో చెప్పాను. పిరికిపాలు జాస్తని......"

"పాపం! వాళ్ళమ్మ పోయిందట."

"బహుశా రుక్మిణి ఆ సంఘటన కోసమే ఎదురు చూస్తున్నదేమో!"

అదోరకంగా నవ్వింది అక్కయ్య. నాకు అక్కయ్య మీద ఎక్కడలేని అసహ్యం వేసింది.

"రమా! నోటికేమాటొస్తే అది మాట్లాడమేనా?"

"సర్లెండి! ఇంతకూ తమరనేదేమిటి? రుక్మిణి చేసిన పని మంచిదంటారా? ఒక్కో మల్లెమొగ్గే తుంపుతూ మెల్లగా అంది.

అక్కయ్య కంఠంలో వ్యంగ్యం పుట్టిపడుతూంది.

"ఎన్ని జన్మాల సంస్కారాల ఫలితమో కాకుంటే అలా ఈ వ్యామోహాలనుండి తప్పించుకొని నువ్వూ, నేనూ పొమ్మంటే పోగలమా!"

నా గుండెల్లో గూడుకట్టుకొన్న ఏహ్యాభావం గొంతులోకి ఎగదట్టింది.

"ప్చ్! మరే! ఇంతకూ ఏమంటావ్? నువ్వూ నీ రుక్కు దగ్గరకు వెళ్తానంటావా? పూలుకోయడం ఆపి జవాబు కోసం నా ముఖంలోకి పరిశీలనగా చూసింది.

"వెళ్ళగలిగేశక్తే నాలోవుంటే అలా అంటావేమిటి? చెప్పానుగా నువ్వూ, నేనూ పోవాలనుకున్నా మనలోని బలహీనతలు అడుగు ముందుకు వెయ్యనివ్వవు. వాటిని జయించి పోయే శక్తి మనకు లేదు. రుక్మిణిలోని మహత్తర శక్తిని నువ్వు గుర్తించలేకపోయినా నేను గుర్తించగలను రమా! భగవంతుడు నాకా శక్తి ఇచ్చాడు." చివరి వాక్యం నొక్కినొక్కి పలికాను.

"ఏమిటా మహత్తర శక్తి? పిరికితనానికి మరో పర్యాయపదం! తనవూహాలోకానికి విరుద్ధంగా వుందనేగా—ఈ పరిసరాల్లోనుండి పారిపోవడం. అర్థంపర్థంలేని ఆ అమరత్వానికన్నా అందుకోగల్గిన ఈ మానవత్వంలోనే నాకు మహదానందం లభిస్తుంది. నేను రుక్మిణిలాంటి పిరికి పందను కాదు. వెళ్ళగలిగితే నువ్వు వెళ్ళు" అని పూలసజ్జను వూపుకుంటూ విసురుగా లోపలికి వెళ్ళింది అక్కయ్య.

ఈ ప్రపంచం మా ముగ్గురికి మూడు విధాలుగా కనిపిస్తోంది. తెలుగుపండిట్ అంటుండేవారు. జన్మజన్మాలుగా సంపాదించిన సంస్కారమంతా దైవదత్తమయిన ప్రసాదితమైన రంగుటద్దంలాంటిది. దాన్లోనుండి ఏ వస్తువును చూసినా అదే రంగులో కనిపిస్తుందట! అంతేగాబోలు! అక్కయ్యని, రుక్కుని, ప్రక్కప్రక్కన బెట్టి పోల్చుకుంటూ ఓ అరగంట సేపు అలాగే మల్లెపందిరికింద నిలబడ్డాను! అంతే ఆ తర్వాత ప్రవహిస్తున్న జీవనవాహిని ఉధృతంగా నన్ను ముంచెత్తింది!

—'భారతి' నుండి.

# పాప

అలసిపోయిన సూర్యుడు విశ్రాంతికోసం మేఘాలను చుంబిస్తున్న కొండల క్రీనీడల్లోకి ఆయాసంగా అడుగు లేస్తున్నాడు. ఆహారసంపాదనకు వెళ్ళిన పక్షులు—ఎక్కడో అరుస్తున్న పిల్లలకు జవాబిస్తూ త్వరత్వరగా గూళ్ళవైపు ఎగిరిపోతున్నాయి. రోడ్లమీద జనసమ్మర్ధం క్రిక్కిరిసుంది. ఎవరిముఖంలో చూసినా ఆతృత, గాబరా! పరిగెడ్తున్నారు. ఎక్కడికో? ఎందుకో మరి! వీళ్ళతోపాటే బస్సులూ, కార్లూ, రిక్షాలూ పరిగెడ్తున్నాయి—వీళ్ళ హృదయాలకు ప్రతిబింబంగా—వీళ్ళ ఆతృతకు క్రీనీడగా! ఎదురుగా ఏముందో, ప్రక్కనేం జరుగుతుందో తెలిసికోకుండా వీళ్ళు పరిగెత్తడం చూస్తే పరుగుపందెంగానీ వుందేమోననిపించింది! అంగలేసుకుంటూ వెళ్తున్న ఓ పెద్దమనిషి నాపి "ఎందుకిలా పరుగెడ్తున్నారు?" అన్నాను. అతను చిత్రంగా నా వైపు చూచి—అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు! ఆశ్చర్యంతో ఓ ఐదునిముషాలు పేవ్‌మెంటుమీద నిలబడి—అడుగులో అడుగేస్తూ మెల్లగా కదిలిపోయాను.

రోడ్డుమీదున్న ఎలక్ట్రిక్ లైట్లన్నీ ఒక్కసారిగా నన్నుచూసి నవ్వాయి. నేనూ నవ్వుతోనే పలకరించి పార్కువైపుగా నడిచాను. పరిచయమున్న ముఖం ఒక్కటీ కనిపించలేదు. క్రోటను చెట్టుకింద కూర్చుని కళ్ళు మూసుకున్నాను. తల తిరిగిపోతుంది. మనుషులు పరిగెడ్తున్నారు—

అరుస్తున్నారు - నవ్వుతున్నారు. కొంతమంది పరిగె త్తలేక కూర్చున్నారు. కూర్చున్నవాళ్ళను చూసి పరిగెత్తేవాళ్ళు నవ్వుతున్నారు. పరిగెత్తలేక కూర్చున్నవాళ్ళు - జాలిగా దీనంగా ముఖంపెట్టారు. హృదయ విదారకంగా వున్న ఆ దృశ్యాన్ని చూళ్ళేక కళ్ళు తెరిచాను. హృదయం అధో లోకాలకు కృంగి పోతున్నట్లనిపించింది.

జీవితంలో ఏరోజూ కలగనంతటి నిరాశానిలం హృద యాన్ని కాల్చివేసింది.

ఎందుకు ? ఎందుకీ హృదయం ఇలా కాలిపోతుంది ?

కారణంకోసం తడివి చూశాను. ప్రతి రక్తపు బొట్టును.

ప్రతి రక్తపు బొట్టూ - ప్రతి జీవాణువూ గొంతు చించుకుని "పరిగెతు .పరిగెత్తు" అని అరుస్తున్నాయి.

ఆ అరుపులు హృదయంలో ప్రతిధ్వనించి హృద యాన్ని నానా భీభత్సంగా తయారుచేశాయి.

పరుగె త్తలేను.

పరుగె త్తలేను.

పరుగెత్తను.

అన్నాను కచ్చితంగా.

'నువ్వు' రాకుంటే వుండు నే పోతా'నని పరిగె త్తి పోతున్న హృదయాన్ని ఆపి ప్రాటితో కట్టి క్రోటనుచెట్టు గాఢాలింగనాన్ని వదల్చుకొని లేచి నిలబడ్డాను.

హృదయం తిరగబడింది.

పోరాటంలో కూలి ప్రయ్యాలైంది.

మళ్ళీ ఆతికించాలి—అతికించాలి.

ఎలాగ ? ఎలా ?

ఓ చల్లని చూపు—ఓచల్లని మాట "పరుగెత్తకున్నా పర్వాలేదు. నడచివెళ్ళినా గమ్యస్థానం చేరుకోగలవు' అని—

—ఓ మాట—

—ఓ చూపు—

అధోలోకాలకు కృంగిపోతున్న ఈ హృదయాన్ని నిలద్రొక్కేందుకు—

ప్రయ్యలైన యీ హృదయం అతుక్కునేటట్లు—కావాలి—యీ క్షణమే కావాలి.

మోడుబారిన చెట్టులావుంది జీవితం. స్నేహితులున్నారు. కానీ మనసిచ్చి పుచ్చుకునే స్నేహితులులేరు.

ఒక ప్రాణస్నేహితుణ్ణి సంపాదించుకోవడం ఎంత కష్టమో యిప్పుడు తెలుస్తుంది. సందులూ గొందులూ దాటిపోతున్నాను. చటుక్కున రాజశేఖరం గుర్తుకొచ్చాడు. కాళ్ళు మెల్లమెల్లగా అటు నడిచాయి.

చుట్టూ పదిమంది పిల్లల్ని పెట్టుకుని ట్యూషను చెప్తున్నాడు.

"కూర్చోరా !" కుర్చీ చూపించాడు చిరునవ్వుతో. కుర్చీలో కూర్చుని బరువుగా వూపిరి తీశాను.

"అలా పార్కుదాకా పోదాం రా !"

"వీళ్ళకు ట్యూషను పూర్తయ్యేసరికి ఎనిమిదవుతుంది."

"పోనీ—తర్వాత" ఆశగా చూశాను వాడికళ్ళ లోకి.

"సారీ! తర్వాత భోంచేసేసరికి కాలేజీ టైమవు తుంది."

"  ।జా!"

"ఎమ్. ఎ. కు పోతున్నానని నీతో చెప్పానుగా. నైట్ కాలేజీకి అటెండవుతున్నాను."

విశ్రాంతితీసుకోనుగూడా భయపడి పరిగెత్తిపోతున్న రాజశేఖరాన్ని చూచి వ్రయ్యలైన హృదయం విలవిల్లా డింది.

"వెళ్తాను" లేచాను.

"కాఫీ తీసుకుని వెళ్దువుగాన్లే! కూర్చో!"

కాఫీ కొచ్చినట్లు!

ఎవ్వరూ నన్నర్థం చేసుకోలేరేం?

హృదయం యింకా—యింకా అధోలోకానికి కృంగిపోతుంది.

వాడేదో అంటున్నాడు. విన్పించుకోకుండా వచ్చే శాను.

ఇంటికొచ్చి కుళ్ళి మంచంలో వాలిపోయాను. చీలి వ్రయ్యలైన హృదయంలోనుండి రక్తధారలు స్రవిస్తు న్నాయి.

కాలి మండిపోతున్న కళ్ళల్లోనుండి బాష్పకణాలు రాలిపడ్తున్నాయి.

చల్లని మృదువైన స్పర్శ నుదురుమీద కలిగింది.

కళ్ళు తెరచి కన్నీళ్ళు తుడుచుకొని చుట్టూ కలయ చూశాను.

పాలరాతితో మలచిన బొమ్మలాగ—సంవత్సరం దాటీ దాటని ముద్దులు మూటకట్టే చిన్నారిపాప! నా కళ్ళను నమ్మలేక కళ్ళు నులుముకుని చూశాను. ఎవరీ పాప? ఎలా వచ్చింది?

భగవత్ స్వరూపమా?

ప్రకృతికి ప్రతిబింబమా:

తెలుపూ—పసుపూ కలిసిన రంగు, గుండ్రని ముఖం ఎత్తయిన సన్నని ముక్కు—నల్లని విశాలమైన కళ్ళు— సన్నని ఎర్రని పెదిమలు.

ఏ అదృష్టశాలి యీ అందాలరాసిని నవమాసాలు మోసింది?

ఏ పుణ్యశాలి యీ ముగ్ధ మోహనరూపాన్ని పెంచి పెద్దచేస్తుంది?

మంచంమీదనుండి లేచి పాపను హృదయానికి హత్తుకున్నాను.

చిగురుల్లాంటి పాపచేతులు ముఖాన్నంతా మృదువుగా తడిమాయి.

నిర్మలంగావున్న పాపచేతులు కన్నీటి మరకలచే మలినమయ్యాయి.

"ఎవరి పాపవమ్మా? ఎవరు పాపవు తల్లీ!" పాప కన్నుల్లో నా ప్రతిబింబాన్ని చూసుకుంటూ ఎండిపోయిన పెదవులను తడుపుకుంటూ అడిగాను.

పాప కన్నుల్లో పెదిమలపై నాట్యమాడే నవ్వు "నీ పాపనే!" అన్నాయి.

పాప నవ్వుల భాషను అర్థం చేసుకొన్నాను.

వ్రయ్యలైన హృదయానికి పాపను దగ్గరగా చేర్చుకొన్నాను.

"అన్నానికి, రా!" అంది అమ్మ.

"ఎవరి పాపమ్మా?"

"మన పాపే!" అమ్మ నవ్వింది.

"చెప్పమ్మా!"

"ప్రక్కవాటాలో క్రొత్తగా యీరోజే చేరారు. వాళ్ళపాప. వాళ్ళకు తెలీకుండా వరండాలోనుండి వచ్చినట్లుంది. ఇలా యివ్వరా! ఇచ్చొస్తాను" అమ్మ చేతులు చాపింది.

"కాసేపుండనీమ్మా! యిక్కడుందని చెప్పు"

అమ్మ వెళ్ళిపోయింది.

పాప నాతో ఆడుకుని అలసి ఒళ్ళో నిద్రపోయింది. పాపను తీసికెళ్ళేందుకు వాళ్ళమ్మ వచ్చింది.

"వుంచండి" పాప నివ్వడం యిష్టంలేక అన్నాను.

"అయ్యో! రాత్రంతా మీ ప్రాణం తోడేస్తుంది!"

"పర్వాలేదు! వుంచండి!"

"వుదయమే తెచ్చుకుందునుగాని"

పాపను తీసుకొని వెళ్ళిపోయింది.

పాప మెత్తని చేతులనూ—మెత్తని హృదయాన్ని

లచుకుంటూ హాయిగా నిద్రపోయాను. మరునాడుత సాయంత్రం పాపనుతీసుకొని పార్కుకు పోతానన్నాను.

"మిమ్మల్నక్కడ కూర్చోనీదు"

"పర్వాలేదు"

ఆమె నవ్వి పాపను నా చేతుల్లో పెట్టింది.

"జాగ్రత్తండీ! అటూ యిటూ వెళ్తుంది."

"ప్రాణం పోగొట్టుకుంటానా ?"

ఆమె ఆశ్చర్యంతో అలాగే నిలబడింది.

నిన్నటి క్రోటను చెట్టుక్రింద యిద్దరం కూర్చు న్నాము.

క్రోటను ఆకులు రెండుకోసి పాప చేతికిచ్చాను.

ఇసకలో కాసేపు ఆడుకుంది.

కాసేపు నాతో మాట్లాడింది.

నా వ్రేలు పట్టుకుని నడవబోయి రెండుసార్లు పడింది.

"యీ రోజుకు చాలు తల్లీ! రేపు" పాపను తీసుకు యింటికికొచ్చేశాను.

దగ్గర దగ్గర పగలంతా నేనూ, పాపా ఆడుకుంటూ వుండేవాళ్ళం. సాయంకాలం తప్పకుండా పార్కుకెళ్ళి క్రోటను చెట్టును కలుసుకొని మాట్లాడి — ఆటలాడుకొని వచ్చేవాళ్ళం. ఓ సంవత్సరం గడిచిపోయింది.

పాప పడకండా నడవడం నేర్చుకొంది.

పార్కులోకెళ్ళగనే—నాభుజం మీదనుండి దిగి వ్రేలు పట్టుకునేది.

ఇద్దరం మెల్లగా పార్కంతా చుట్టేవాళ్ళం.

పాప నవ్వేది మాట్లాడేది.

పాప మాటలకన్నా నవ్వే నాకు బాగా అర్థమయ్యేది.

మరో సంవత్సరం గడిచింది—

పార్కులో దించగనే పరుగులు తీసేది పాప.

కాస్త దూరం పరుగెత్తి వెనక్కు తిరిగి నన్ను చూసి నవ్వేది.

"దా ! దా !

"వస్తున్నా ! తల్లీ !"

కాసేపు నాతో నడిచేది. కాసేపు పరుగులు తీసేది.

ఒకసారి పరిగెడ్తూ పరిగెడ్తూ పడింది.

లేవదీసి ఒళ్ళో కూర్చొబెట్టుకున్నాను.

"ఎందుకు తల్లీ ! పరిగెత్తేది ? నాతో నడువమ్మా!"

అర్థం చేసుకున్నట్లు తలూపింది పాప

మరో సంవత్సరం గడిచింది. పాప ఇప్పుడు నాకు నడక నేర్పుతుంది. మాటలు నేర్పుతుంది.

"నా దగ్గర మాటలు నేర్చుకున్నావు! నాకే మాటలు నేర్పుతావా ? ఎంత జాణవయ్యావే తల్లీ !

కిలకిలా నవ్వి ఎదపై వాలేది పాప.

ఇప్పుడు పాప యింటిదగ్గరనుండి పార్కుదాకా నడుస్తుంది. దారంతా చిలక మాట్లాడినట్లు మాట్లాడ్తూనే వుంటుంది.

[8]

"మీ అమ్మ నీకు వన ఎక్కువ పోసినట్లుంది" అంటే చప్పట్లు కొట్టి నవ్వేది పాప.

పాపకు ఐదు సంవత్సరాలు నిండాయి.

ఎప్పుడూ నాతో ఆడుకునే పాప యిప్పుడు బడికి పోతుంది.

బిక్కు-బిక్కు-మంటూ ఐదుగంటలవరకూ పాప కోసం ఎదురుచూసేవాణ్ణి.

స్కూలునుండి రాగానే పాప నాదగ్గరకు పరిగెత్తేది.

ఓరోజున పరుగెత్తికొచ్చి నావళ్ళో వ్రాలింది. "అన్నయ్యా! యీాలోజేం నా లెక్క రైటు"

ప్రపంచాన్ని జయించినంత గొప్పగా ముఖం పెట్టింది పాప.

"అలాగేం తల్లీ! నీలెక్కెప్పుడూ తప్పుపోదమ్మా!" పాపను హృదయానికి హత్తుకుని ముద్దుపెట్టుకున్నాను. ఉన్నట్టుండి,

"యీారోజు పాల్కు-కొద్దన్నయ్యా!" అంది.

"ఏం తల్లీ!"

"లెక్కలు చెప్పవూ?"

"మళ్ళీవచ్చి చేసుకుందామమ్మా!"

"గునింతం?"

"పొద్దున"

"బడికెళ్ళొద్దూ?"

"వెళ్ళువుగాన్లే తల్లీ!"

"ఊహు!" పాప తల అడ్డంగా తిప్పింది. ప్రేమగా

యిన్ని రోజులు పెంచిన స్నేహలతను ఎవరో బలవంతంగా పెరికినట్లయింది.

"పాపా!"

నాకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఇన్నిరోజులుగ నన్నర్థం చేసుకున్న పాప యీ రోజు అర్థంకాని దృక్కులతో చూసింది.

ఆ నల్లని విశాలమైన కళ్ళల్లో పూర్వమున్న మృదుత్వం లేదనిపిస్తోంది.

ఇప్పుడా స్థలాన్ని ఆలోచనలు దోచుకున్నాయి.

పెదవులమీద ఎప్పుడూ తొణికిసలాడే చిరునవ్వు క్రమక్రమంగా మాయమవుతుంది.

"అయితే పార్కుకురావా తల్లీ! ఆడుకోవద్దూ" పాప కళ్ళల్లోకి చూస్తూ బాధగా అన్నాను. పాప కళ్ళు దీర్ఘంగా ఆలోచిస్తున్నాయి.

"రామ్మా! రావూ?" చేతులుచాపి జాలిగా పిలిచాను.

అయిష్టంగా నాచేతుల్లోకి వచ్చింది పాప. పార్కులో కూర్చున్నా పాప మునపటిలా లేదు.

పాపలో పూర్తిగా మార్పొచ్చింది. "అన్నయ్యా 'అ ఆ' లు లాయనా?" నాగడ్డాన్ని తన చిట్టిచేతుల్తో ఎత్తి పట్టుకుని నాకళ్ళల్లోకి చూస్తూ అంది పాప.

"యింటికి పోయాక రాస్తువుగానీ, చిరిచికి పుల్ల ఆడుకుందామా?"

పాప కోపంతో క్రోటను చెట్టు అవతలికెళ్ళి కూర్చుంది.

నా మనసు ముక్కలయింది.

"అలాగే రాస్తువు గానీరా!" బ్రతిమిలాడాను.

'అ ఆ'లన్నీ తప్పులేకుండా వరస క్రమంగా వ్రాసింది యిసకలో.

"రైట్! బాగా వ్రాశావమ్మా!"

పాపకళ్ళు గర్వంతో మెరిశాయి!

నాకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"పాట పాలనా అన్నయ్యా!"

"ఊఁ......"

"బలే తాత మన బాపూజీ!" పాటను తప్పులు తప్పులుగా పాడింది.

"ఎవరు చెప్పారీ పాట?"

"టీచరు"

"బాగుంది"

మరొకసారి పాపకళ్ళు తళతళలాడాయి. పాపకు ఎనిమిదేళ్ళు వచ్చాయి. ఫస్ట్‌ఫామ్‌లో చేరేందుకు తీరిక లేకుండా చదువుతుంది. ఇప్పుడు పాపను చూడాలంటే స్కూలుకన్నా వెళ్ళాలి. లేకుంటే ట్యూషను మాస్టరింటికి అన్నా వెళ్ళాలి.

"అప్పుడే ఏం చదువులు? ఇప్పట్నుండే పాప కెందుకీ శ్రమ? వచ్చే సంవత్సరం చేర్చగూడదూ?" అంటే వాళ్ళమ్మ

అదోరకంగా నవ్వింది—నన్నూ నా మాటనూ లక్ష్య పెట్టకండా.

తలొంచుకు వచ్చేశాను.

ఆరోజు మాస్టరింటికి గాబోలు — పరుగులేస్తూ వెళ్తోంది.

పిల్చాను.

వచ్చింది.

"సాయంత్రం రామ్మా! పార్కుకు పోదామూ!"

"మాస్టరు పంపరు"

ఇప్పుడు నా మాటలు పాప కర్థంకావు. పాప మాటలు నాకర్థంకావు.

"ఎప్పుడూ చదువుతుంటావా?" నా హృదయము మెలికలు తిరిగింది.

"ఆడుకుంటా నన్నయ్యా!"

"ఎప్పుడు? ఎవర్తో?"

"సాయంకాలం"

"ఎవర్తో? ఎవర్తో?"

"నాగు, వరాలు, జయ......"

"చాలు. చాలు పాపా!" పెద్దగా అరిచాను. తర్వాత నా అరుపుకు నేనే సిగ్గుపడ్డాను.

పాప చెప్పడం ఆపి పెద్ద పెద్ద కళ్ళతో నావైపు చూసింది.

"పార్కుకొచ్చి నాతో ఆడుకోవడం ఇష్టం లేదన్న మాట?"

"నీతోనా?"

"ఏం!"

"నాగు కొచ్చినన్ని ఆటలు నీకొచ్చా?"

"ఓ! యింకా ఎక్కువే వచ్చు!"

"అబ్బ!"

"అవును తల్లీ!"

"వరాలులా గుడిగుడి గుంజం చెప్తా?"

"ఓ!"

"జయలా పరెత్తగలవూ?"

"ఓ"

పాప చప్పట్లు కొట్టి పెద్దగా నవ్వింది.

"అన్నయ్యను గెలిచేస్తానా?"

"అయితే నాతో పరెత్తు చూద్దాం!"

పాపకు తెలుసు నేను పరిగెత్తలేనని!

"నీతోనా?"

"ఊఁ" పాపకళ్ళు నవ్వుతున్నాయి.

"ఊహు" తల అడ్డంగా తిప్పాను.

"అయితే మనిద్దరం ఎలా ఆడుకుంటాం?"

అవును. నిజమే!

ఇంకేం మాట్లాడలేకపోయాను.

పాపవైపు చూస్తూ నిలబడ్డాను.

పాపకూడా కాసేపు అలాగే నిలబడింది.

"అన్నయ్యా!"

"ఊఁ......"

"దాన్నేమంటావు?" అటునుంచి పారిపోతున్న పిల్లిని చూపుతూ అడిగింది పాప.

"పిల్లి!"

"కాదు"

"యింకేమంటావు?"

"క్యాట్"

"క్యాటా!"

పాప నవ్వింది.

ఆ నవ్వులో నాకు ధ్వనించిన అర్థాలు కోటానుకోట్లు!

ఆ నవ్వుకు నా హృదయం చిల్లులు పడింది.

పాపలేచి సంచి తీసుకుంది.

"వెళ్తావా? పాపా?"

వెళ్తానన్నట్లుగా తలూపింది.

"సాయంకాలం రావూ?"

"రాను"

పిలుస్తున్నా వినిపించుకోకుండా పాప పరుగుతీసింది.

పాప వెంట పరుగెత్తలేక అక్కడే నిలబడ్డాను. కన్నీటి పొర చూపును కప్పేసేవరకూ అక్కడే నిలబడి—పాప కనిపించినంతవరకు చూశాను.

లేడిపిల్లలా చంగు చంగుమంటూ ఎగిరిపోయింది.

అంతే! తర్వాతేం కన్పించలేదు.

ఇప్పటివరకూ నాదగ్గర నడక నేర్చుకున్న పాప ఇప్పుడు నాదగ్గరనుండి పారిపోయింది. నా దగ్గర మాటలు నేర్చుకొన్న పాప—నామాటల నర్థం చేసుకోలేకపోయింది!

ఇక నామాట లెవరి కర్ధమవుతాయి? పరిగెత్తలేని నా మీద జాలిచూపే దెవరు? పరిగెత్తకున్నా పర్వాలేదని ఓదార్చే దెవరు? నడిచి గమ్యస్థానం చేరుకోగలవని హామీ యిచ్చే దెవరు?

స్థంభాన్నానుకుని—కళ్ళు తుడుచుకొని మరొకసారి పాపవెళ్ళిన దిక్కుగా చూశాను

పాప కనిపించలేదు.

ఎప్పుడో పరుగుతీసి వుంటుంది!

—'ఆంధ్రప్రభ' వారపత్రిక నుండి.

# మనుషులూ - మమతలూ

ప్రియాగమనంచే రాగరంజితమైన తన సుందర వదనాన్ని కొండచాటు చేసుకుని చిరునవ్వు నవ్వింది సంధ్య. ప్రియురాలి కెమ్మోవిపై నాట్యమాడే మధుర మంద హాసానికి జవాబుగా చిరునవ్వు లొలికిస్తూ త్వరత్వరగ సంధ్యను చేరబోతున్నాడు భాస్కరుడు. పశుల కాపర్ల యీలపాటలు, గూళ్ళకుపోయే పక్షుల కిలకిలారావా లతో కలిసి ఒక విధమైన వింతశబ్దాన్ని కలుగజేస్తున్నాయి. పచ్చగడ్డిమోపు నెత్తిన పెట్టుకువస్తున్న సుందరయ్య ఆల మందలు దాటి చరచరా యింటివైపు నడుస్తున్నాడు. గడ్డి మోపును గాట్లో పడేసి, పెద్దగా నిట్టూరుస్తూ కుక్కిమంచం మీద కూలబడ్డాడు. తలగుడ్డతీసి దుమ్ముదులిపి నోట్లోవున్న పొగాకు గాండ్రించి వుమ్మేశాడు.

"తులసమ్మా! పెద్దలోటాడు నీళ్ళు తే తల్లీ!" కుక్కి మంచం కాళ్ళకట్ట బిగిస్తూ అన్నాడు సుందరయ్య.

"పెద్దన్నొచ్చాడోదినా!" అంటూ వాకిట్లోనుండి అరిచింది తులసి.

చామనచాయా, నిటారుముక్కూ, గుండ్రనికళ్ళూ తులసికో ప్రత్యేకాకర్షణ నిస్తాయి. ఇంకా చిన్నతనం, చిలిపి తనం వదలలేదని ఆమె ముఖంచూడగానే తెలుస్తుంది.

మంచినీళ్ళలోటా సుందరయ్య చేతిలో పెట్టి, అక్కడే నిల్చుంది. గ్లాసెడు నీళ్ళూ రెండు గుక్కల్లో త్రాగి పంచ నున్న పొగాకు కాడతీసి కొద్దిగాతుంచి నోట్లో వేసు కున్నాడు.

"ఒదినేం జేస్తూందమ్మా" లోటాను తులసి చేతి కందిస్తూ అన్నాడు.

"పాలు తీస్తూంది" లోటాను తీసుకుంటూ అంది.

"బుద్ధిలేని మనుషులు. ఎన్నితూర్లు చెప్పాల !" గాండ్రించి ఉమ్మి అన్నాడు సుందరయ్య. తులసి వెళ్ళేందుకు వెనక్కు తిరిగింది.

"ఇదిగో తులసమ్మా! నువ్వన్నా కాస్తబుద్ధి చెప్ప కూడదూ? చెవిటోడి చెవిలో శంకూదినట్లు నేనువాగా ల్సిందేగాని లెక్కాపక్కా! ఆ కోడెపెయ్య చావడానికా బతకడానికా?"

"అదికాదు పెద్దన్నా! పైఖర్చుకన్నా వస్తుందిగదా! లేకుంటే ఎలా జరుగుతుంది" నవ్వుతూ అంది తులసి.

"మీకు తెలిసిందంతే ! పశువులెక్కి రావాలని వుంటేగదూ? పొలం దున్నేవాణ్ణి ఆ కష్టం నాకు తెలుస్తుంది? మీకేం దొరసానుల్లాగ యింట్లో కూర్చుంటారు. ఉండే జత ఎద్దుల్లో ఒకదానికి కాలు విరిగె. మళ్ళీ యింకో ఎద్దును కొనాలంటే తేరకవుద్దా? వందలు కుమ్మరించాలి! ముందటి సారట్టేచేసి ముందటి కోడెదూడ ప్రాణం తీశారు. ఛీ! మనిషి జన్మ ఎత్తంగనేసరా?" ఛీత్కారం చేశాడు సుందరయ్య.

ఇంతలో పాలచెంబుతో, సుందరయ్య భార్య సావిత్రమ్మ అక్కడికి వొచ్చింది.

"తులసీ! పక్కింటివాళ్ళకు పాలిచ్చి రా" పాల చెంబును తులసి చేతికిస్తూ అంది సావిత్రమ్మ. తులసి కుచ్చుల జడను వయ్యారంగా వూపుకుంటూ పాలచెంబు తీసుకెళ్ళింది.

"తులసమ్మ నెందుకే పంపడం?" తులసివైపు ఆప్యాయంగా చూస్తూ భార్యతో అన్నాడు సుందరయ్య.

"పక్కింటికే గదూ?"

"అయితే మటుకు" అని పెద్దగా అని, "అమ్మ పోతూ పోతూ గుర్తుగా తులసమ్మ నిచ్చిపోయింది" స్వగతంలాగ అనుకొని పంచగుడ్డతో కళ్ళు తుడుచుకొన్నాడు. మరణ శయ్యమీద తల్లి చెప్పినమాట యీనాటికీ తన చెవుల్లో గింగురుమంటూనే వుంది. ఆరోజు తల్లి చెప్పిన మాటలు యిప్పుడు చెప్పినట్లేవుంది.

'పెద్దోడా! దీన్ని నా ప్రాణంకన్నా ఎక్కువగా సాకాన్రా' అంది రమణమ్మ కన్నీళ్ళతో తులసిని సుందరయ్య చేతిలో పెట్టినప్పుడు. "ఛా! అదేంటే! తులసి నీకు కూతురైతే నాకు చెల్లెలుగాదూ? నువ్వు లేనంతమాత్రాన తులసమ్మకు లోటు కలుగనిస్తానా?" అని తులసిని తన చేతుల్లోకి తీసుకొని తన కూతురిలాగ సాకాడు ఆనాటినుండీ. తులసి తన ఆశ— తన జీవితం— అమ్మకు మరో ప్రతిబింబం— ఇది సుందరయ్య అభిప్రాయం.

ఆనాడు తల్లికిచ్చిన మాట ప్రకారమే చెల్లెల్ని గారాబంగా పెంచి పెద్దచేశాడు. శక్తికి మించిన పనైనా పైవూరికి పంపి స్కూలుఫైనలుదాకా చదువు చెప్పించాడు. తులసిని డాక్టరుగా చూడాలని సుందరయ్య ఆశ. కానీ యింట్లో ఆర్థిక పరిస్థితు లెలావున్నాయో తెలిసిన తులసి చదవగలిగినా చదవలేనని ఖచ్చితంగా చెప్పేసింది. దాంతో సుందరయ్య ఆశ నిరాశయింది.

సంవత్సరంపాటు వెదికి తలకు మించిన సంబంధాన్నొకటి పట్టుకొచ్చాడు. ఊళ్ళోవాళ్ళంతా శక్తికి మించిన పని, మానుకోమన్నారు. ససేమిరా, నాశక్తి మీకేం తెలుసు పొమ్మన్నాడు. రెండెకరాల భూమి అమ్మి చెల్లెలి పెండ్లి చేశాడు. దాంతో సుందరయ్య తమ్ముడు చంద్రయ్య కళ్ళు తెరిచి భూమిమీదపడ్డాడు! ఇంకమీదట అన్నతో కలిసుంటే నెత్తికి చేతులొస్తాయని గ్రహించి వేరుకాపురం పెట్టాడు. ఇదంతా తోడికోడలి ప్రోత్సాహమే నంటుంది సావిత్రమ్మ! ఏది ఎలాగైనా యింటికి మధ్య గోడ నిలిచింది. ఉన్న ఒక ఎకరానూ చెరో అరెకరా పంచుకున్నారు. ఆనాటినుండీ అన్నకూ తమ్ముడికీ మాటల్లేవు. సుందరయ్య దృష్టిలో తమ్ముడు పశువుకన్నా హీనుడు. తమ్ముడి విషయం మనసులో మెదలగానే ఒళ్ళంతా జలదరించినట్లయింది. "మనిషిగా పుట్టంగనే సరా?" గొణిగాడు సుందరయ్య తనలో తనే.

"ఇదిగో జాబు."

సావిత్రమ్మ మాటల్తో యీ లోకంలోకి వచ్చి చేరాడు.

"ఎక్కణ్ణుంచే?"

"ఇంకెక్కణ్ణించి! తులసమ్మ అత్తోరింటినుంచి."

"ఏవంటా?"

"ఏవుందీ? సారెలూ చీరెలూ పెట్టి పంపమనేగా?" దీర్ఘం తీసింది.

సుందరయ్య బాధగా మూలిగాడు. సావిత్రమ్మ హృదయం బావురుమంది. చేతిలో చెంబును వూపుకుంటూ, కూనిరాగంతీస్తూ వచ్చింది తులసి.

"ఎదురింటి పిన్ని వాళ్ళకు పాలు కావాలంట వదినా!" వదిన ప్రక్కలో కూర్చుంటూ అంది తులసి.

సావిత్రమ్మ భర్తవైపు చూసింది ప్రశ్నార్థకంగా.

"రేపట్నుంచి ఒక్క చుక్క పాలుతీసి నట్లుండాల" కోపంగా భార్యవైపు చూసి అన్నాడు సుందరయ్య.

"పై ఖర్చుకు డబ్బిస్తే మారాజుగా మానా్తా" నిష్ఠూరంగా అంది సావిత్రమ్మ.

సుందరయ్య ఏ జవాబూ చెప్పలేక వచ్చిన కోపాన్నంతా దిగమ్రింగాడు.

"తులసమ్మా! సంగటి గెలికి క్రింద పెట్టిరా!" ఆడుబిడ్డతో అంది సావిత్రమ్మ. తులసి పాలచెంబు తీసుకుని లోపలి కెళ్ళింది.

"ఉగాది యింకెన్నాళ్ళుందేంటి?"

"ఇంకెన్నాళ్ళుంది? వచ్చే బేస్తవారమే."

"సారె పెట్టను ఎంతవుద్దేంటి?"

"వాళ్ళు పెట్టమన్నయ్యన్నీ పెడ్తే నాలుగయిదొందలవుతాయి."

"అబ్బో!"

"మరి ఉగాది సారంటే తేరకవుద్దేంటి?"

"వాడేమన్నా యిస్తాడా?" భార్యవైపు సాలోచనగా చూస్తూ అన్నాడు సుందరయ్య.

"ఇస్తాడు—బండ!"

"నా వక్కడివల్లవుద్దా?"

"ఆ సంగతిముందే తెలవదూ. నేను మొత్తుకుంటూనే వున్నా— నామాటేమన్నా చెవిలో దూరిందా? రెండెకరాల పొలమమ్మి పెళ్ళి చేశావు. ఇప్పుడా కాస్త అమ్మేసెయ్ సరిపోద్ది!"

"ఏంటే నీ సాధింపు! నా యిష్టం. యిల్లుకూడా అమ్మేస్తా! నువ్వెవరు నన్నడిగేటందుకు? వాడున్నాడేమో—"

సావిత్రమ్మ ముఖమింత చేసుకుని దొడ్లోకెళ్ళి గాటిగొయ్య మీదెక్కి గోడికోడల్ని కేకేసింది.

"ఏవక్కా!" గోడదగ్గరకొచ్చి అడిగింది సరోజిని.

"మీ ఆయనుండాడా!"

"వూ......"

"వాళ్ళన్న రమ్మంటుండాడని చెప్పు."

"ఎందుకూ?" దీర్ఘం తీసింది సరోజిని.

"అదేనమ్మా! మన తులసికి ఉగాదిసారె పెట్టొద్దా?"

"ఐతే?" సరోజిని ఏమీ అర్థం కానట్లు చూసింది తోడికోడలి ముఖంలోకి.

సావిత్రమ్మ హృదయం భగభగమండింది. "ఎంత నంగనాచివే!" అనే మాట నాలిక చివరి దాకా వచ్చిందికానీ, అనలేకపోయింది. అంటే సరోజిని గొంతు ఏ స్థాయిలోనికి లేస్తుందో సావిత్రమ్మకు తెలుసు.

"అదే సరోజా! అంతబరువూ మా ఒక్కరివల్లే అవుద్దా? చెరికాసంత..." నీళ్ళు నమిలింది సావిత్రమ్మ.

"నేను ముందే చెప్పలా అక్కా! మావల్ల కాదని. పొలం కాస్తా అమ్మి కట్నమిచ్చాను. తినడానికి గింజల్లేక మే మలో లక్ష్మణా! అంటూ అల్లాడ్తున్నాము. ఇంకా నంద లొందలు తెమ్మంటే మాతాట్లో ఎక్కణ్ణుంచి తెచ్చాము?" కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లు చెప్పింది సరోజిని. సావిత్రమ్మ ముఖం వెలవెలపోయింది.

"అదేదో వాళ్ళే మాట్లాడుకుంటూరు. చంద్రయ్యను రమ్మను."

"తలకు మించిన పనెవరు పెట్టుకోమన్నారు?" దెప్పి పొడిచింది సరోజిని.

"అయితే మీ బావదే తప్పంటావు?"

"ముమ్మాటికీ! లేకుంటే మన మెంత? మన తాహ తెంత? ఎవరి గొంతులు నులమాలని యీ పని? మీకేం తల్లీ! మగపిల్లలుగల మహారాజులు. ఆడపిల్లలు గలవాళ్ళం! మమ్మల్నేం చెయ్యాలనుకున్నారు? మా గొంతులు కొయ్యాలనే కదూ?" ఆమన్నరస్థాయిలో గొంతెత్తింది సరోజిని.

ఆరునెల్లనుండీ, పొలం అమ్మి కట్నమిచ్చినందుకు గానూ భర్తను సాధిస్తూనే వుంది సావిత్రమ్మ. అడగవలసిన మాటలన్నీ అడిగింది. కానీ ఆ మాటే యిప్పుడు తోడికోడలంటే ఓర్చుకోలేకపోయింది. మానవప్రకృతిలో యిదో చిత్రమైన విషయం. మన కాత్మీయులుగా వుండేవాళ్ళను మనం ఎన్నయినా అంటాము. కానీ యితరులు ఆ తప్పును వేలెట్టి చూపితే మన మోర్చుకోలేము. వాళ్ళతో పోట్లాడతాము. ఆ పనే చేసింది సావిత్రమ్మ .

"అవునే! మీా గొంతుకోసి యేం బాగుపడ్తామని! నీనోటి కెట్టొచ్చాయే పాడుమాటలు! ఎంత చేస్తే ఏం? యిశ్వాసముండొద్దూ?"

"అవును మేం యిశ్వాసంలేని కుక్కలమే! ఇంక ఆ జానెడుకూడా అమ్ముకుని నోట్లో మట్టికొట్టుకోవాల్సిందే!" చేతులు త్రిప్పుతూ అంది సరోజిని.

"నీ బిడ్డయితే అప్పుతెచ్చిపెట్టవూ ? అసలా పిల్ల సోదంటేనే నీకు గిట్టకపోయే !"

"ఓ యబ్బో! అంత ప్రేమగలదానివి నువ్వే పెట్టుకోరాదూ !"

సావిత్రి హృదయంలో మంటలు రేగాయి !

"పెద్దాదినా !" తులసి సావిత్రమ్మ చెయ్యి పట్టుకొని బాధగా అంది.

సావిత్రమ్మ ఆడబిడ్డ కళ్ళల్లోకి చూచింది. విశాలమైన తులసికళ్ళు తడిగావున్నాయి. సావిత్రమ్మ గుండె ఆర్ద్రితతో నీరయిపోయింది.

"తులసమ్మా !"

"ఇంకరా ! పెద్దాదినా !"

"దాని నోరు చూడు ఎట్ట పడ్తోందో !"

"ఏం మాటలొదినా !"

ఉస్సురు మంటూ వచ్చి అరుగుమీద కూలబడింది సావిత్రమ్మ. దీనవదనంతో తులసి వాకిట్లో నిల్చుంది.

"సందె దీపం పెట్టమ్మా !"

తులసి లోపలికెళ్ళింది.

"ఏ వయింది ?"

"ఏ మవుద్ది ?"

"వాళ్ళేడూ ?"

"వుంటే యేం ? భార్యమాటకు జవదాట్తాడా ? అందరూ నీలాగే వుంటారేంటి ?"

"సర్లే ! అసలు సంగతేంటో ఏడ్వు !"

"ఉన్నమాటంటే ఉండూరచ్చి రాలేదుతే"

నిష్ఠూరంగా అంది సావిత్రమ్మ.

"ఛీ ! దరిద్రపుగొట్టు !..."అని చివాల్న లేచి పై గుడ్డ తీసుకొని వెళ్ళిపోయాడు.

"ఇప్పుడెక్కడికి పెద్దన్న పోతున్నాడు ? అప్పుడే దీపంపెట్టి వచ్చిన తులసీ, సావిత్రమ్మవైపు చూచి అంది.

"ఏం మనుషులో !" నిట్టూరుస్తూ పైట చెరగు అరుగుమీద పరచుకొని నడుం వాల్చింది సావిత్రమ్మ.

"ఎక్కడికొదినా ?" తన ప్రశ్నకు జవాబు రాకపోవడంచే మరల అడిగింది తులసి.

"ఏడకో మరి ! డబ్బు సర్దొద్దూ ?"

తులసి వదిన ప్రక్కలో కూర్చుంది.

"కాదొదినా ? యిప్పుడవన్నీ పెట్టకుంటే ఏం ?"

"అదేం మాట తులసీ ! యిప్పుడు పెట్టకుంటే ఇంకెప్పుడు పెడ్తాము ? నువ్వు సంతోషంగా పోతే మాకదే చాలు."

"మీ రింత కష్టపడ్తేగానీ నాకు సంతోషం కలగదేంటొదినా ?" తులసి గొంతు కొద్దిగా జీరపోయింది. సావిత్రమ్మ ఆడబిడ్డవైపు విచిత్రంగా చూచింది.

"చూడు తులసమ్మా ! నిన్ను బిడ్డలాగ పెంచాను. మాకో బిడ్డుంటే మేం పెట్టుకోమా ?

"అది వేరొదినా ? కానీ నేనిప్పుడెవ్వరి దాన్నీ కాదు." తులసి కళ్ళల్లో నీళ్ళు ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా చెంపల మీదుగా పరుగులెత్తాయి.

"ఛా ! ఛా ! సందెవేళ కంట్లో నీళ్ళు పెట్టొచ్చా యిప్పుడేమయిందని తులసమ్మా !"

"నా వల్లనే కదా యీ కుటుంబం చీలిపోయింది. మీ రెప్పుడూ పోట్లాడుకొనేది నా కొరకే కదా వదినా ! పెద్దన్న యిప్పుడా వున్న నాలుగు సెంట్లుగూడా అమ్మాలని చూడ్డం లేదూ ?" తులసిలో ఆవేశం జాస్తి. హృదయం ఉద్వేగంతో వూగిసలాడింది. ఆమె మనో ప్రవృత్తే వేరు. తను యితరులకోసం కష్టపడొచ్చుగానీ తనకొరకితర్లు

ఏమాత్రం కష్టపడరాదు. తులసి భావాలే వేరు. ఇంట్లో ఎవ్వరూ ఆమెను సరిగ్గా అర్థంచేసుకోలేదు — అర్థంచేసుకోనుగూడా ఎవ్వరూ ప్రయత్నించలేదు. బహుశా ప్రయత్నించినా ఫలితం దక్కేది కాదేమో! అనురాగంతో, అమాయకత్వంతో, మనోజ్ఞ మందహాసంతో, తన సర్వస్వాన్ని అర్పణచేసుకొనే అందాలసుమబాల—తులసి!

"నీ కెట్ట తెలుసు తులసమ్మా పెద్దన్న పొలమమ్మతాడని?"

"వెంకయ్య తాత చెప్పాడులే! నాకంతా తెలుసొదినా? నా కళ్ళెందుకు కప్పుతావు?" దోసిట్లో ముఖం పెట్టుకొంది తులసి.

సావిత్రమ్మ కంగారుగా లేచి కూర్చుంది.

"ఇదిగో,నీకు పిచ్చేమన్నా పట్టిందా?మా ఎతలేందో మేం పడ్తాం చిన్నపిల్లవు. ఇదంతా నీకెందుకు? నిన్ను చీటికి మాటికి వాళ్లు సాపన పెడ్తుంటే మా మనసు లెట్టుంటయ్యి తులసమ్మా?"

"అంటే అంటార్లే! పొలం అమ్మద్దొదినా!" కళ్ళనీళ్లు పైట చెరగుతో తుడుచుకుంటూ అంది తులసి.

సావిత్రమ్మకళ్లల్లో బాధ సుడులు తిరిగింది.

"నీ అన్నా ఒదినా లేరనుకున్నావా?"

"అది కాదొదినా..." ఏదో చెప్పాలనుకున్న తులసి యింక చెప్పలేక పోయింది. హృదయంలో రేగిన దుఃఖాగ్ని జ్వాలలు గొంతును కాల్చేశాయి.

"సరే! లెగు అన్నం తిందువు."

తులసి తల అడ్డంగా తిప్పింది.

"ఏం ?"

"పెద్దన్నను రానీ."

"ఆయ నేజాం కొస్తాడో ?"

తులసి లేవలేదు. సావిత్రమ్మ తనలో తనే అన్నా చెల్లెలి రాగబంధానికి సన్నగా నవ్వుకుని పిల్లల కన్నం పెట్టేందుకు లోపలి కెళ్ళింది. తులసి తల్లో ఆలోచనలు గిర్రున తిరుగు తున్నాయి. చిన్నన్న తనంటే ఎంత ప్రేమగా వుండేవాడు. ఇప్పుడు తనవల్ల యింతఖర్చయిం దనేగా తనతో మాట్లాడ్డమే మానుకున్నాడు. ఎంతలో ఎంత మారిపోతారు మనుషులు ? చిన్నొదినమటుకూ తన్నెంత ఆదరంతో చూసేది. ఇప్పుడా మమతలూ మమకారాలూ ఏమైనాయో! తులసి కళ్ళల్లో నీళ్లు నిండాయి బాధగా కళ్ళుమూసుకుంది.

"తులసమ్మా! నిదరపోతుండావా ?" పశువులకు గడ్డివేస్తూ అడిగింది సావిత్రమ్మ.

తులసి జవాబుగా తల ఆడించింది. తల ఆలోచన లతో బరువయింది. అయినా ఆలోచనలు ఆగిపోలేదు. తులసి ఏమిటేమిటో పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తూనే వుంది. డబ్బే మానవజీవితానికి పరమలక్ష్యమా? జీవితంలో చేయ గల్గిందల్లా ధనసంపాదనేనా? అనురాగాలకూ, ఆప్యాయా లకూ డబ్బుదగ్గర చోటేలేదా? ఐనా పెద్దన్న చేసినపని ఏం సబబుగా వుందని? తన సుఖంకోసం, సంతోషంకోసం యింతమంది కష్టపడాల్నా ? అప్పటిగ్గాన్నీ, తనమీాద

ప్రేమున్నట్లు తెలీదా? డబ్బుతో పనిలేని ప్రపంచ మేదన్నా ఒకటుంటే! అదే గాబోలు స్వర్గం! పూర్ణిమ చంద్రుడు గబ గబా పైకి ఎగబ్రాకుతున్నాడు. చంద్రుడివైపు చూస్తూ చూస్తూ తులసి కళ్ళు మూసుకుంది.

* * * *

మసక చీకటి. పక్షుల కిలకిలారావాలు ముచ్చటగా వినిపిస్తున్నాయి. ఆకాశంలో అక్కడక్కడా మబ్బు కన్నెలు, సుందర నీలాభ్రం అంతా మాదే అన్నట్లు సవిలాసంగా నాట్యం చేస్తున్నాయి. చల్లని గాలి హృదయానికి హాయిగా వుంది. ఏ యింట్లోనుండి చూచినా 'సుయ్' 'సుయ్' మనే పాలు పితికే సవ్వడి, కవ్వంచేసే కలకల స్వనంలో కలిసి మరో వింత శబ్దాన్ని కలుగజేస్తున్నది.

సావిత్రమ్మ కాస్త ఆలస్యంగా లేచినందుకు తనలో తనే గొణుక్కుంటూ మజ్జిగ చిలకసాగింది. మజ్జిగలో నీళ్ళు పోసేందుకు తులసి చేదుకొస్తుందని తులసిని కేకేసింది సావిత్రమ్మ.

"ఇంత ప్రొద్దెక్కినా యీ పిల్లకు మెలకువ రాదే మబ్బా!" స్వగతంలా అనుకుంది సావిత్రమ్మ.

"తులసమ్మా! బారెడు పొద్దయింది లే!"

ఇంతలో సావిత్రమ్మ చిన్నకొడుకు 'చిట్టి' అక్కడ కొచ్చాడు.

"అమ్మా! వెన్న బెట్టే!" చెయ్యిచాపి అడిగాడు.

"వెన్నంతా యిప్పుడు తింటే పండక్కు అప్పచ్చులు కాల్చుకోవద్దట్రా!"

వాడు రాగం తీశాడు.

"సర్లే! తులస తను లేపుకు రా పెద్దా."

ఒక్క పరుగులో వెళ్ళొచ్చాడు.

"తులసత్తే! లేచిందమ్మో!"

"అయితే పిల్చుకు రా!"

"ముందు ... పెట్టు ... పూ..."

"యింద."

"తులసత్తే! లేదమ్మో!" వెన్నతింటూ చెప్పాడు.

"దొడ్లో చూడ్రా!"

వాడు మళ్ళీ వచ్చి లేదన్నాడు.

సావిత్రమ్మ ఆలోచనలో పడింది. తను లేచేటప్పుడు తులసి మంచంవైపు చూడలేదు. అప్పటికి లేచిందో లేదో? తానూ కుండా తీసుకుని ఆలోచిస్తూ బావిదగ్గర కెళ్ళింది. తులసి రెండుపేటల బంగారు గొలుసు బావిగట్టునుంది. ఏమిటి దీనర్థం? సావిత్రమ్మ గుండె గుబిల్లుమంది.

"కొంప కూలిందయ్యో!" గావుకేక పెట్టింది సావిత్రమ్మ.

పాలు పితుకుతున్న సుందరయ్య ఒక్క పరుగులో బావిదగ్గరకు చేరుకున్నాడు.

"ఏమైందే......" సుందరయ్య గొంతు వణికింది.

"మన బంగారు తల్లయ్యో! యింకెక్కడుంది దేవుడా!" సావిత్రమ్మ గుండె బాదుకుంటూ అంది. సుందరయ్య చటుక్కున బావిలోకి దూకాడు. సావిత్రమ్మ అరుపుల్తో నలుగురూ అక్కడకు చేరారు. ఐదు నిమిషాల్లో

తులసిని బయటకు తీశారు. ఇంతగోల జరిగినా సరోజిని మటుకు రాలేదుగానీ, చంద్రయ్య పరుగెత్తుకుంటూ వచ్చాడు. అప్పటికే తులసిని హాస్పిటలుకు తీసికెళ్ళారు.

"ఏమైంది దొదినా!" చంద్రయ్య ఆతృతగా అడిగాడు.

సావిత్రమ్మ హృదయం మండిపోతూంది. తులసి యీ అఘాయిత్యానికి కారకులు తోడికోడలూ మరిదేనని ఆమె పూర్తి నమ్మకం. మరిది కంటికి కనబడగానే ఆమె శోకమంతా కోపంలోకి మారింది. దాంతో మరిదిమీదికి కస్సుమని తాచుపాములాగ లేచింది. వదిన ఎంత కోపంగా వుందో తెలుసుకొన్న చంద్రయ్య చల్లగా అక్కణ్ణుండి తప్పుకున్నాడు. అయినా సావిత్రమ్మ అంతటితో ఆగలేదు. మరిదినీ, తోడికోడల్నీ కలిపి శాపనార్థాలు పెట్టసాగింది. ఇంక సరోజిని యింట్లో కూర్చోలేకపోయింది.

"ఏవమ్మో! నీ పెద్దతనముంటే నీ దగ్గరుంటుందిగానీ! ఎవ్వరిమీద చూపిస్తే..."

"సిగ్గులేందానా ! మాట్లాడ్డానికి నోరెట్లాగసింది దే. నిండు ప్రాణం తీసుకుంటివే ! రాక్షసీ! ఇంకెంతమందిని చంపేందుకు బతుకున్నావో!"

సరోజిని ముఖం వెలవెలపోయింది. ఎలాగో తమాయించుకుని సమాధాన మిచ్చేందుకు తయారయిందిగానీ యింతలో వాకిటిముందు బండి ఆగడం, బండిలోనుండి తులసిని తీసుకురావడం జరిగింది. దాంతో సరోజిని నోటికి తాళం పడింది. అప్పుడు తులసిని చూడకుండావెళ్తే బాగుండదని తులసి మంచం దగ్గరగా వెళ్ళి నిల్చుంది. తులసి నుదురు

మీద తగిలిన దెబ్బ తన నుదురుమీదే తగిలినట్లు విలవిల్లా డింది సావిత్రమ్మ. తులసి కళ్ళెత్తి నాలుగువైపులా చూసింది.

"గోదేవిలాంటి దానివి నీ కెంత కష్టమొచ్చిందే తల్లీ" పైటచెంగుతో కళ్ళొత్తుకుంటూ అంది సావిత్రమ్మ. సరోజిని చురచుర చూసింది తోడికోడలివైపు

"కూర్చో చిన్నాదినా!" కళ్ళల్లో నీళ్లు తిరుగు తుండగా హీనస్వరంతో అంది తులసి. సరోజిని హృద యంలో చెయ్యిపెట్టి దేవినట్లయింది. అంతకన్నా క్రూరమైన శిక్ష మరొకటి లేదన్నట్టు బాధపడింది. తులసితో మాట్లాడ్డా నికి ప్రయత్నించింది కానీ మాట్లాళ్ళేకపోయింది.

తులసి కళ్ళనుండి నీళ్ళు కార్తూనే వున్నాయి. గుంజ నానుకుని కూర్చున్న సుందరయ్య యిక ఓర్చుకోలేక పోయాడు.

"తులసమ్మా! ఎందు కేడ్చేది! పెద్దన్న చచ్చి పొయ్యా డనుకున్నావా?"

తులసి రెండు చేతుల్లో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

సరోజిని భారహృదయంతో తులసి మంచం దగ్గరగా నడిచింది.

అరుగుమీద కూర్చునున్న చంద్రయ్య కృంగిపోయాడు. తులసి ఎందు కేడుస్తూందో చంద్రయ్యకు తెలుసుగానీ తను వెళ్ళి ముఖం చూపలేడు. రెండు చేతుల్లో ముఖం పెట్టుకుని ఆలోచనలో పడ్డాడు చంద్రయ్య. సరోజిని తులసిని పలక

రించి వెళ్ళిపోయింది. చంద్రయ్య వెళ్ళేందుకు లేచి నిల బడ్డాడు. తులసి అంతా గమనిస్తూనే వుంది.

"పెద్దన్నా! చిన్నన్నను పిలు" గద్గదకంఠంతో అంది తులసి.

సుందరయ్య తమ్ముణ్ణి పిలవలేదు.

"చంద్రయ్యా! తులసమ్మ పిలుస్తూందిరా." సావిత్రమ్మ వెళ్తున్న మరిదిని కేకేసింది. చంద్రయ్య వెనక్కు తిరిగొచ్చాడు. తులసి కూర్చోమన్నట్లు సైగ చేసింది. చంద్రయ్య కింద కూలబడ్డాడు. సుందరయ్య చివాల్న లేచి వెళ్ళిపోయాడు! తులసి కళ్ళల్లోని బాధ వర్ణించడానికి వీల్లేదు.

"పెద్ద న్నెప్పుడూ యింతే!" వదినవైపు చూస్తూ అంది తులసి. సావిత్రమ్మ జవాబుగా చిరునవ్వు నవ్వింది.

"అన్నకు నామీద కోపం" చంద్రయ్య నిష్ఠూరంగా అన్నాడు. దానికి సావిత్రమ్మా తులసీ మౌనంగానే వుండి పోయారు.

"సాయంత్రం డబ్బు తెచ్చిస్తా నొదినా! తులసమ్మ కే కొరతా లేకుండా సారె పెట్టాలి." సావిత్రమ్మ మౌనంగా తలూపింది. తులసి భారంగా నిట్టూర్చింది.

* * * *

మబ్బు కన్నెలతో సవిలాసంగా ఆటలాడుతున్నాడు ఉదయభాస్కరుడు. పశుల కాపర్లు యాలపాటలు పాడు

కుంటూ ఆలమందలను తోలుకుపోతున్నారు పచ్చిక బయళ్ళకు.

రెండెడ్ల బండిలో కూర్చుని తులసిని కేకేశాడు చంద్రయ్య.

"వస్తున్నా చిన్నాన్నా!" లోపల్నుండే అంది తులసి.

"ఇంకా జాగుచేశావంటే బండి తప్పౌతుంది" ఎద్దు నోటికి గడ్డి అందిస్తూ అన్నాడు చంద్రయ్య. కాళ్ళనిండా పసుపుతో క్రొత్త చీరతో కళకళలాడుతూ వచ్చింది తులసి. సావిత్రమ్మ పెద్దబొట్టుతో ఆడబిడ్డ కెదురుగా వచ్చింది. చంటిపిల్లను చంకలో వేసుకుని బండిదగ్గర కొచ్చింది సరోజిని. సావిత్రమ్మా, తులసీ బండిలో ఎక్కి కూర్చున్నారు.

"వెళ్ళొస్తా చిన్నాదినా!" సరోజిని చంకలోఉన్న పసిదాని బుగ్గ గిల్లుతూ అంది తులసి. ఎందుకో సరోజిని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తులసి కళ్లు సుందరయ్యకోసం వెతుకుతున్నాయి. ఇంతలో సుందరయ్య అంగలేసుకుంటూ బండిదగ్గర కొచ్చాడు.

"వెళ్ళొస్తా పెద్దన్నా!" గద్గదకంఠంతో అంది తులసి.

"సుందరయ్య తులసి చేతిలో పదిరూపాయల నోటు పెట్టాడు. తులసి వద్దని చెప్పాలనుకుంది. కానీ చెప్పలేక పోయింది. సుందరయ్య చెల్లెలితో ఏమేమో చెప్పాలను కున్నాడు. కానీ ఏమీ చెప్పలేకపోయాడు.

"చంద్రయ్యా! బండి జాగ్రత్తగా తోలు" పై పంచతో కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు సుందరయ్య.

చంద్రయ్య తనలో తనే సన్నగా నవ్వుకున్నాడు. బండి కదిలింది. ఎద్దులు పరిగెడ్తున్నాయి.

"అంతా అమ్మో! ఎర్రి తల్లి!" అస్పష్టంగా తనలో తనే గొణుక్కున్నాడు దూరంలో పోతున్న బండివైపు చూస్తూ సుందరయ్య.

—"ఆంధ్రప్రభ" వారపత్రికనుండి.

# మాతృదేవి

"వచ్చావా?"

ఆమె తలెత్తి అతనిముఖంలోకి ఒకసారి చూసి తల దించుకొన్నది.

"రావేమోనని భయపడ్డాను."

ఎటో చూస్తూ నవ్వింది దామె.

"అలా ఉన్నావేం?"

"ఎలా?"

"భయంగా...... మీ నాన్నకు తెలిసిందా?"

"లేదు."

"మరి?"

"ఏం లేదు."

ఆమె మరొకవైపుకు తల తిప్పింది.

అప్పుడే ప్యాసెంజర్ వచ్చి వెళ్ళిపోవడంచేత ప్లాట్ ఫారమ్ కాస్త రద్దీగానే ఉంది. పోర్టర్లు హడావిడిగా తిరుగుతున్నారు.

ఎలక్ట్రిక్ దీపాలు ఎందుకనో గుడ్డిగా వెలుగుతున్నాయి. దూరంగా ప్లాట్‌ఫారమ్‌మీద ఉన్న చింత చెట్టుమీదనుంచి ఉన్నట్టుండి ఏదో పక్షి అరచింది.

ఆమె ఉలిక్కిపడింది.

'అలా వెళ్ళి బెంచీమీద కూర్చో...నేను వెళ్ళి

ఏవన్నా పండ్లు పట్టుకొస్తాను." ఆమె ముఖంలోకి చూసి అన్నాడు.

ఆమె తలూపింది.

అతను వెళ్ళిపోయాడు.

పది నిమిషాలు చాలా బరువుగా కదిలిపోయాయి. పండ్లు, మిఠాయిలు, పుస్తకాలతో తిరిగి వచ్చాడతను. ఆమె అలాగే నిలబడి ఉండడం చూసి ఆశ్చర్యపోయాడు.

"అలాగే నిల్చుండి పోయావేం? ఏమైంది?"

"ఏంలేదు."

ఆమె గొంతు తడబడింది.

కాళ్ళు తడబడ్డాయి.

బెంచీమీదకు వెళ్ళి కూర్చుంది.

ప్లాట్‌ఫారమ్ క్రమక్రమంగా పల్చపడుతున్నది. ఉన్న ఒకరిద్దరూ కునుకు తీస్తున్నారు. అతను వాచీచూసుకున్నాడు. పన్నెండుగంటలు చూపుతున్నది.

"నిద్రపోతావా?"

ఆమె లేదన్నట్లు తల అడ్డంగా తిప్పింది.

"ఈ పండు తిను." ఆపిలుపండు అందించాడు. ఆమె తీసుకుంది. మిగిలిన పండ్లన్నీ ఒక్కొక్కటే అతను తింటున్నాడు. ఆమె చేతిలో ఆపిలుపండు అలాగే ఉంది. అతనికోపం వచ్చింది. విసుక్కున్నాడు.

ఆమె నవ్వింది. ఆ నవ్వులో అపశ్రుతి. అతని హృదయ విపంచిమీద ఆ అపశ్రుతులు పలికాయి.

అతని ముఖం వివర్ణమైంది. ఆమె ముఖంలోకి ఓరగా పరీక్షగా చూశాడు. సన్నని వెలుగులో సరికొత్త రంగును పులుముకొన్న చింతచెట్టువైపు దీక్షగా చూస్తున్నది ఆమె. అతని హృదయం జివ్వుమంది. బాధ సుడులు లేచాయి.

"ఒంట్లో బాగలేదా?" అన్నాడు చివరకు.

ఆమె అతని ముఖంలోకి బిక్కచూపు చూసి తల తిప్పుకుంది.

అతనిహృదయం ఏదో కీడును శంకించింది. ఏమీ మాట్లాడకుండా వెళ్ళి మరో బెంచీమీద పడుకున్నాడు.

ఆమె అలాగే కూర్చుంది. బెంచీ నానుకుని కాళ్ళు మడిచి పైన పెట్టుకుని మోకాళ్ళ చుట్టూ చేతులేసి, మోకాళ్ళమీద గడ్డం ఆన్చి చింతచెట్టువైపు చూస్తూ అలాగే కొన్నిగంటలసేపు ఆలోచనల్లో తేలిపోయింది.

తను చేస్తున్న దేవిటి?

ఇక్కడ కెందుకు వచ్చిం దసలు?

అసలు తన స్థితేమిటి?

తన చదువూ, వివేకమూ ఏమయ్యాయి! వద్దు. యిక తను ఆలోచించరాదు. జరిగింది జరిగిపోయింది.

అవును. జరిగింది జరిగిపోయింది. అసలు తనేం తప్పు చేసిందని? ఎందు కిలా బాధ పడాలి? అతనితో వచ్చివేయడం తప్పెలా అవుతుంది? తనలోని బలీయమైన 'తృష్ణ', 'వాంఛ', 'కోరిక' తీరకుండా ఎన్నాళ్ళు బ్రతకడం?

ఆకలి దప్పుల్లా అదీ ఒక యిచ్ఛ.

అవును. అంతే! అలాగని తనెన్ని పుస్తకాలు చదవ లేదు? దైహికవాంఛ నిజంగా తప్పే అయితే ఎందుకలా వ్రాస్తారు?

పోనీ యిది ప్రేమ అని ఎందు కనుకోరాదు? అయినా తనకు ప్రేమేమిటి? వద్దు......యిక...ఇలాంటి ఆలోచనలు చాలించడం మంచిది.

ఆమె ప్రక్కనున్న పత్రికతీసి తిరగవేయసాగింది. 'మంగళసూత్రం' అనే కథమీద కళ్ళు టక్కున ఆగి పోయాయి. అప్రయత్నంగా చేతులు జోసి మెడను తడి మాయి. తెల్లని తామరతూండ్లలాంటి చేతులు కళా విహీనంగా—మొండిగా ఉన్నాయి.

ఆమె గాఢంగా నిట్టూర్చింది. హృదయంలోని అగ్నిజ్వాలలు — వేడి నిట్టూర్పులోనుండి బైటకు వచ్చి ముఖాన్ని కాల్చివేశాయి. కాంతి విహీనమైన ఫాలభాగం మీద ఏర్పడిన ఒకే ఒక ముడి ఆలోచన ఉరవడిని విశద పరుస్తున్నది.

బలవంతంగా కథ చదవడం మొదలుపెట్టింది. ఐదు నిమిషాలకు కథ చదవడం పూర్తయింది. కానీ ఏం చదివిందో ఆమె కర్థం కాలేదు. మెల్లగా తనలో తనే నవ్వుకుంది. కళ్ళుమూసుకుని బరువుగా నిట్టూర్చింది. తన వివాహ దినోత్సవం లీలగా కన్నులముందు కదిలింది.

తెల్లని బట్టల్లో కలకలలాడిపోతున్న ఆయన తన జీవితాన్నంతా వెలుగులో నింపగలరని పెళ్ళిపందిరిలోనే

కోటికలలు కనింది. ఆయన కన్నుల్లోని వాత్సల్యం తన జీవితాన్నంతా స్వర్గమయం చేయగలదని గాలిమేడలు కట్టుకుంది. అలా కలలు కంటుండగానే నాలుగు సంవత్సరాలు యిట్టే జరిగిపోయాయి.

రామూ, రవీ రెండు కన్నుల్లా తన జీవితానికి దివ్వెలయ్యారు.

కానీ అసలు జీవన జ్యోతే ఆరిపోతుందని ఎవరనుకున్నారు?

ఆమె కన్నులు చెమర్చాయి. చెమర్చిన కళ్ళనెత్తి దూరంగా ఉన్న చింతచెట్టువైపు చూసింది. గుడ్లగూబ భయంకరంగా అరిచింది. చల్లనిగాలి జివ్వుమని నరాల్ని కొరికివేసింది. ఆమె మరీ ముడుచుకు కూర్చుంది.

దూరంగా ఇంజను కూత వినిపించింది. ఆమె తొణక్కుండా అలాగే కూర్చుంది. అతను గాబరా పడి లేచాడు. బుక్కింగ్ ఆఫీసువైపు పరుగుతీశాడు.

మరో నిమిషానికి తిరిగివచ్చి "వచ్చేది గూడ్సట!" బాధా, విచారమూ కలిపి నవ్వురూపంలోకి మార్చి అన్నాడు.

ఆమె వినలేదు.

ఒకవేళ వినిందేమో? జవాబు మటుకు చెప్పలేదు. అతను జవాబుకోసం చూచి నిరుత్సాహంతో తిరిగి తన బెంచీదగ్గరకు వెళ్ళిపోయాడు.

ఆమె బరువుగా కళ్ళుదింపి మరో పేజీ తిప్పింది.

"మాతృహృదయం" అనే శీర్షిక. దాని క్రింద

రెక్కలురాని పక్షిపిల్లలకు ఆహారం తినిపిస్తున్న తల్లిపక్షి సహజంగా సుందరంగా ఉన్న వర్ణచిత్రం. ఆమె అలాగే ఆ బొమ్మవైపు చూస్తున్నది.

అతను అంతా గమనిస్తున్నాడు. ఆమె ముఖంలోని రంగులు సినిమా రీళ్ళలాగా మారుతున్నాయి. చివరికో రంగు స్థిరంగా నిలిచిపోయింది.

మరో అరగంట జరిగిపోయింది.

ఆమె కంట్లోనుంచి ఒకేఒక కన్నీటి బొట్టు జారి పడింది. మోకాళ్ళమీద పెట్టుకున్న పుస్తకం జారి క్రింద పడింది. మోకాళ్ళలో ముఖం దాచుకుందామె. అతను గాబరాపడి లేచి నిలబడి తిరిగి కూర్చున్నాడు.

మరో అరగంటకు ఆమె తలెత్తింది.

ఇంజను మోత—

గంట ఘణ ఘణ—

అతని పరుగు—

రైలు రావడం—

ప్లాట్‌ఫారంమీద ఆగడం.

అంతా చూస్తున్నదామె. కానీ ఒకటీ అర్థంకాదు.

అతను దగ్గరకువచ్చి ఏదో చెప్పాడు. ఆమె అతని వైపు చూసింది. అతను వెళ్ళి రైలుపెట్లో కూర్చున్నాడు. ఆమె అతన్ని అనుసరించింది. రైలు ఒక్క కుదుపు కుదిపి ముందుకు సాగింది.

అతనేదో అడగాలనుకున్నాడు. నోరు కదిపాడు. కాని ఎందుకనో ఆగిపోయాడు.

ఆమె ముందటిలాగే మోకాళ్ళు మడిచి, గడ్డం ఆన్చి కిటికీలోనుంచి చూస్తూ కూర్చుంది. అతను బెడ్డు పరుచుకొని పడుకున్నాడు. ఆమె మళ్ళీ పుస్తకం తెరిచింది. ఆ బొమ్మవైపే చూస్తున్నది. మెదడు ఆలోచనతో వేడెక్కింది. నిశ్వాసనంద్వారా ఆ వేడి బైటికి వస్తున్నది. మోకాళ్ళమీద గడ్డం ఆన్చి కిటికీలోంచి చూచింది.

మనోనేత్రంముందు పక్షీ, పక్షిపిల్లలే మెదలుతున్నాయి. ఆలోచనా, వివేకం ఉన్న తను తక్కిన జంతు పక్ష్యాదులకన్నా నీచంగా, హీనంగా ఎందుకు తయారయింది? ఉత్తమ జన్మఅయిన మానవజన్మలో చేయవలసిన ఉత్తమకార్యం యిదేనా?

భగవాన్!

ఏమిటీ ఆకర్షణ?

ఐదేళ్ళన్నా పూర్తిగా నిండని రామూ, పట్టుమని మూడు సంవత్సరాలు లేని రవీ తనులేకుండా ఎలా బ్రతగ్గలరు?

తండ్రిని దూరంచేసి వాళ్ళకన్యాయం చేసినందుకు భగవంతుణ్ణి ఎన్నిసార్లు తిట్టిపోసింది! కానీ ఈరోజు తను చేస్తున్న దేమిటి? కడుపులో పెట్టుకొని కాపాడవలసిన తను, సుఖమూ, సంతోషమూ, చివరకు ప్రాణమూ త్యాగం చేయవలసి తను కేవలం శారీరక ద్రోహానికి లోనై...

భగవాన్!

ఇలాంటి జీవితాన్ని భగవంతుడు ఎందుకు ప్రసాదిం

చాడు? ముసలితనంలో ఉన్నతండ్రి మరొకరి సాయం లేకుండా తన బిడ్డల్ని ఎలా పెంచగలడు?

రామూ! బాబూ! మీకెంత ద్రోహం చేశాను! దోసిట్లో ముఖం దాచుకుని నిశ్శబ్దంగా ఏడ్చింది. పది నిమిషాల తర్వాత పెట్టెంతా కలయజూసింది. ఎదురుగా కూర్చొనున్న ముసలాయన, ప్రక్కనున్న మరో యువకుడూ జోగుతూ జోగుతూ ఆమెవైపు ఒక కన్ను వేసేఉంచారు! ఆమె అసహ్యంగా కిటికీవైపు తలతిప్పింది. చిక్కని చీకటిని చూసుకుని దృష్టి దూరలోకాలకు పోయింది.

రైలు వేగంగా పరుగెత్తుతున్నది. నిశ్శబ్ద నీరవ నిశీధంలో చైతన్యాన్ని చూపిస్తున్నది.

రైలు నడక ఒక్కటే!

ఆమె ఉన్నట్టుండి ఉన్మత్తవలె లేచింది. ఎర్రనికళ్ళు తిరిగి పెట్టెనంతా పరీక్షగా చూశాయి. వణుకుతున్న హస్తద్వయం గొలుసును లాగింది. అంతా ఒక క్షణంలో జరిగింది.

రైలు ఆగింది. తూలుతూ ఆమె నిలువెల్లా కంపించిపోతూంది. జోగుతున్నవాళ్ళందరూ కళ్ళు తెరిచారు. అందరూ బిలబిలమంటూ కిందకు దిగారు. "ఏవిటి? ఏమైంది?"

అందరి కన్నులలో హృదయాల్లో అదే ప్రశ్న!

గార్డు కారణం తెలుసుకునేందుకు పరిశోధన ప్రారంభించాడు.

రైలును ఆపవలసినంతటి పని లేదు. కొంటె కాయలు చేసినపని!

గార్డు కోపం తారస్థాయి నందుకుంది. అపరాధిని పట్టుకొనేందుకు పెట్టె పెట్టె గాలించేస్తున్నారు. ఈ గందరగోళానికి అతను లేచాడు. పెట్టెలో ఆమే, తనూ తప్ప మరెవరూ లేకపోవడం ఆశ్చర్యం కలిగించింది.

"ఇదే స్టేషను?" క్రిందికి దిగేందుకు ప్రయత్నిస్తున్న ఆమెను ప్రశ్నించాడు.

"ఏ స్టేషనూ కాదు."

"మరి రైలెందుకు ఆగింది?"

"నేనే ఆపాను."

అతను ఆశ్చర్యంతో నోరు తెరచి లేచి కూర్చున్నాడు. ఆమె మరో అడుగు ముందుకేసింది.

"ఇలా రా!"

ఆమె వెనక్కు తిరిగింది.

"ఎందు కాపావు?"

"నేను వెళ్ళిపోతాను."

అతను తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు. అందమైన ముఖం వాడిపోయింది. బరువుగా నిట్టూర్చాడు. ఆమె నిర్లక్ష్యంగా తల మరోవైపు తిప్పింది.

"బాగా ఆలోచించుకోమని ముందే చెప్పాను. ఎందుకు తొందరపడ్డావు?"

ఆమె జవాబు చెప్పలేదు. గార్డుముఖం పెట్టెలోకి తొంగిచూసి మాయమయింది.

ఆమె నోరు తెరవబోయింది.

అతను గబుక్కున ఆమెనోరు మూశాడు. ఆమె అతనిచేతిని దూరంగా విసిరికొట్టింది. అతను ఆమె ముఖం లోకి జాలిగా చూచి ఆలోచించసాగాడు.

"వచ్చే స్టేషనులో వెనక్కు పంపిస్తాను. మధ్యంత రంలో ఇక్కడ దిగి ఎలా పోగలవు?" అనునయంగా అన్నాడు.

ఆమె అపనమ్మకంగా చూచింది.

"నమ్మలేవా?"

ఆమె మాట్లాడలేదు.

"ఈ విషయం ఎవరికీ చెప్పను."

ఆమె నిర్లక్ష్యంగా నవ్వింది. అతని మనస్సు చివుక్కుమంది.

మరో ఐదునిమిషాలకు రైలు ముందుకుసాగింది. చెప్పినట్టే అతను ఆమెను వెనక్కు పంపేశాడు.

ఉషఃకాంత చిరునవ్వు లొలికిస్తున్నప్పుడు ఆమె ఇంటిముందు అడుగుపెట్టింది. లోపల్నుండి బాబు ఏడుపు, తండ్రి సముదాయింపు వినవస్తున్నాయి. వణుకుతున్న చేతుల్తో తలుపు తట్టింది. మరో నిమిషానికి తలుపు తెరుచు కుంది.

"సుగుణా!"

ఆమెను చూడగానే ముసలాయన గొంతులోనుండి వచ్చిన మాట అదొక్కటే.

ఆమె తలవంచుకొని లోపలికి నడిచింది. చెంపల మీద కారే కన్నీటిని పైటచెరగుతో ఒత్తుకుంది.

"నువ్వు వస్తావని నాకు తెలుసు సుగుణా! అయినా ఇంత తొందరగా వస్తావనుకోలేదు." సంతోషంగా అన్నాడు.

ఆమె హృదయం పగిలిపోయింది.

"నాన్నా! ఇక ఆ విషయం ఎత్తకు." మెల్లగా రోదిస్తూ అంది.

బాబు ఏడ్పు తిరిగి ప్రారంభమైంది.

"అమ్మ! అమ్మ!"

వాడి ఏడ్పుకు కారణం అదే! సుగుణ లోపలి గదిలో కెళ్ళి మంచంమీద పడి ఏడుస్తున్న బాబును గుండెలకు అదుముకొంది!

"లాతి లెక్కల కెల్లావే!"

సుగుణ మెడచుట్టూ చేతులు వేసి బాబు అడిగిన మొదటి ప్రశ్న అది!

"ఎక్కడి కెళ్ళాను? నిన్నొదిలి ఎక్కడి కెళ్తాను?" బాబును ముద్దుపెట్టుకుని అంది.

"ఏలుతున్నా వెందుకు?" సుగుణ చెక్కిళ్ళమీద కన్నీటిని తుడుస్తూ అడిగాడు.

"ఏడుస్తున్నానా? అబ్బే! ఏదీ?" కన్నీటిని తుడుచుకొని నవ్వి అంది.

ప్రశాంతంగా నిద్రపోతున్న రాము అప్పుడే కళ్ళు తెరచి తల్లి ముఖంలోకి చూచి "అమ్మా! కాఫీ!" అన్నాడు ముద్దుగా.

"ఇప్పుడే తెస్తా రామూ!" అంటూ బాబును భుజాన వేసుకుని లోపలికెళ్ళింది సుగుణ.

వాకిట్లో నిలబడి అంతా గమనిస్తున్న ముసలాయన హాయిగా శ్వాసతీసి ఏమిటో తనలో తనే మెల్లగా గొణుక్కున్నాడు.

—"ఆంధ్రప్రభ" వారపత్రికనుండి.

# జ్ఞాననేత్రం

రాజు బస్సు దిగగానే సరిగ్గా సమయానికి గమ్యస్థానం చేరుకోవాలన్న ఆత్రంతో దుమ్ము రేపుకుంటూ బస్సు తిరిగి ప్రయాణమైంది.

చుట్టూ ఒకసారి కలయజూసి, జేబులోనుండి రుమాలు తీసుకుని ముఖాని పట్టిన చెమట తుడుచుకుని, దారితీశాడు రాజు. పల్లెకు వెళ్ళేందుకు కొత్తగా వేసిన సాఫీ మట్టిరోడ్డు గ్రామస్థులను ఆహ్వానిస్తున్నది హృదయపూర్వకంగా. రోడ్డు కిరువైపులా అక్కడక్కడా ఉన్న తుమ్మచెట్లు బాటసారులకు మనోల్లాసమైన శీతలచ్ఛాయను కలిగించాలని చండభానునితో హోరాహోరీ పోరాడి, చివరకు ఓటమి నంగీకరించి, పరాజితులైన యోధులలా నిరాయుధంగా వట్టి కొమ్మలతో నిలుచున్నాయి జాలిగా, బాధగా చూస్తూ.

రోడ్డుకు మొదటఉన్న ఒకే ఒక వేపచెట్టు కింద జొన్న చొప్పతో తయారుచేసిన తడికలతో కొత్తగా కట్టిన గది రాజును కించిత్తు ఆశ్చర్యపరిచింది.

"రాజూ! ఎప్పుడు రావడం?" సదరు తడికల గదిలో నుంచి అప్పుడే వెలుపలికి వచ్చిన చలపతి చిరునవ్వుతో రాజును పలకరించాడు.

"ఇప్పుడే! ఏమిటి కొత్త వ్యాపారమేదో ప్రారంభించినట్లుందే!" నవ్వుతూ పరామర్శించాడు చిన్ననాటి చెలిమి

కాణ్ణి! సంఘంచేత, దైవంచేత చిన్నచూపు చూడబడి ఆశలకు, ఆశయాలకు, వా స్తవికతకుమధ్య వంతెన కట్టడానికి యథోచితంగా ప్రయత్నిస్తున్న సాహసవంతుణ్ణి.

"ఏముంది? వేసవి కదా? ఈ చుట్టుపక్కల మంచి నీటిబొట్టు దొరకదని..."

"ఓహో! చలివెందర పెట్టావన్నమాట!" అన్నాడు నిండుగా నవ్వి రాజు. కాని, హృదయాంతరంలో ఏదో అవ్యక్తమైన ఆవేదన—వీణ్ణేనా భగవంతుడు అకారణంగా శిక్షిస్తున్నది అన్న మూగప్రశ్న.

"స్వామికార్యం,స్వకార్యం రెండూ నెరవేరతాయని. అలాగే నా వ్యాపారమూ సాగుతుందని... ఏవిట్రా? అలా చిక్కిపోయి నల్లబడ్డావు?" స్నేహితుని ముఖంలోకి పరిశీలనగా చూస్తూ ఆదుర్దా వెలిబుచ్చాడు చలపతి.

"గుంటూరు ఎండలు మాడ్చేస్తున్నాయనుకో. నీ వ్యాపారమేమిటో కాస చూడనీరా బాబూ!" అంటూ తడికల గదిలోకి తలదూర్చాడు రాజు.

చెట్టు కొమ్మకు వేలాడుతూ ఒక అరటి పండ్లగెల, రెండు డబ్బాలలో వేపుశనకాయలు, సీసాలో చాకరకం పిప్పరమెంట్లు ఉన్నాయి.

"ఇదన్నమాట వ్యాపారం?" చలపతి ముఖంలోకి చూసి బరువుగా నిశ్వసించి అన్నాడు.

ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న బాధారేఖలను

నవ్వుతో కప్పిపుచ్చాలని వ్యర్థప్రయత్నంచేసి, "ఏం బాగా లేదా?" అన్నాడు చలపతి.

"రోజుకు ఎంత ఆదాయం వస్తుందేమిటి?"

"ఇంతని చెప్పేందుకు లేదు."

"ఓ! చెప్పలేనంత ఆదాయం వస్తుందన్నమాట." కోపమూ, వ్యంగ్యమూ కలిపి సూటిగా విసిరాడు.

'రాజూ!"

తన వాగ్బాణం చలపతి గుండెల్లో ఎంతటి గాయాన్ని చేసిందో అప్పు డర్థమైంది. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి అశ్రుతప్త నయనాలతో చలపతి కళ్ళల్లోకి చూశాడు.

"ఒక్కణ్ణి! ఎంతొస్తే ఏంరా?"

రాజు తలతిప్పుకొన్నాడు, బరువుగా, బాధగా.

"త్వరలో డాక్టరు కారా! నీ దగ్గరకొచ్చేస్తాను."

"ఏం చేస్తావ్?" తల తిప్పి చలపతి ముఖంలోకి బాధగా చూసి, తన ప్రయత్నం లేకుండానే మరో వాగ్బాణం విసిరాడు.

"ఏం చెయ్యలేనూ?" అసహాయతే రూపొందినట్లయింది.

"పోనీ, ఏం చెయ్యగలవో చెప్పు?" రాజు గొంతు జీరబోయింది.

"మందులు కలపలేనట్రా?" ఆశగా చూశాడు.

"ఉహుం ఇంగ్లీషు ముక్కరాదే? ఏ మందులో ఏ మందు కలపాలో తెలియక్కర్లేదూ?"

"పోనీలేరా! చక్కని వంటచేసి నీచేత బాగా తిని

పిస్తాను. ఇలాగే ఉన్నావంటే, చెప్పద్దూ, ఒక్కరోగీ నీ దగ్గరకు రాడు!"

ఫక్కుమని నవ్వాడు రాజు.

"బాగా తినిపిస్తావా? ఎంత తినిపించగల వేమిటి?"

చలపతి రాజు ముఖంలోకి తేరిపార చూస్తూ "అవున్లే! నేనెంత తినిపించగలను? అర్ధాంగివచ్చి ఆప్యాయంగా నోటి కందిస్తే..." అన్నాడు.

"పోరా! అన్నట్లు ఇంట్లో అందరూ కులాసాయేనా? పెద్దన్నయ్య. చిన్నన్నయ్య?"

"అంతా బాగున్నారు. ఉదయమేగా చూశాను?"

"పెద్దొదినా, చిన్నొదినా, పిల్లలూ?"

"ఆ..." నవ్వుతూ రాజు ముఖంలోకి చూశాడు.

"ఇంకా?"

"ఇంకెవరు?"

"తెలీనట్టు?"

"చెప్పందే ఎలా తెలుస్తుంది?" చలపతి కళ్ళు పగలబడి నవ్వుతున్నాయి.

"చంపక చెప్పరా!"

"గాలిలో తేలిపోతూ, మేఘాలతో ఆడుకుంటున్నది! ఉదయం కనిపించగానే 'చలపతన్నయ్యా! మొగిలిచెండు తెప్పించి పెట్టవూ' అంది. అప్పుడే అనుకున్నాను. నువ్వొస్తున్నావని. అడిగాను. నవ్వుతూ లేడిలా పరిగెత్తిపోయింది. మొగలిచెండు తెప్పించిపెట్టాను. తీసికెళ్తావా?"

"ఊ...ఇవ్వు" అన్నాడు రాజు ఎక్కడో ఊహల్లో తేలుతూ.

"అప్పుడే అంత పరధ్యాన్నమైతే ఎలారా?" మొగలి చెండు అందిస్తూ నవ్వాడు చలపతి.

"నీముఖం!" మొగలిచెండు జాగ్రత్తగా బాగ్‌లో దాస్తూ నవ్వాడు.

"వెళ్ళు, వెళ్ళు. వెయ్యి కన్నులతో ఎదురుచూస్తూ ఉంటుంది! ప్రాక్టీసు పెట్టగానే నన్ను పిలవడం మరిచి పోకు. వంట ఫస్టుగా చేస్తాలే. నువ్వొద్దన్నా అప్లికేష నెలా పెట్టుకోవాలో నాకు తెలీదూ? సుశీల ఆ మాత్రం సాయం చెయ్యకపోతుందా?"

ఇద్దరూ ఫకాలున నవ్వారు.

"చలపతీ! నేను డాక్టర్ని కావడమంటూ జరిగితే నిన్నెలాగయినా నా కాంపౌండర్నిగా చేసుకుంటాను." చల పతి భుజాలమీద రెండుచేతులూ వేసి అన్నాడు రాజు.

పారంలేని వారి స్నేహానికి ఇద్దరికళ్ళూ చెమ్మ గిల్లాయి. హృదయాలు అవ్యక్తమైన ఆనందంతో పరవళ్ళు తొక్కాయి. నిర్వచనాని కందని ఏదో మధురాతిమధుర మైన భావనావాహినిలో ఓక్షణం తేలిపోయారు.

"చలపతీ!"

"ఏంరా?"

"మరి అన్నయ్య ఉన్నపళంగా బయల్దేరి రమ్మన డంలో ఆంతర్యం?"

"పరమాత్ము కెరుక!"

"అంతేనంటావా ?"

"అవున్నా! నాకేం తెలీదు. ఇక వెళ్లు. అన్నట్టు ఇదిగో ఈ గొడుగు తీసికెళ్లు" మూలగా తడికెకు తగిలించి ఉన్న గొడుగు తీసి ఇస్తూ అన్నాడు.

"ఎవరు పంపారు ?"

"ఇంకెవరు ?"

రాజు హాయిగా, తీయగా నవ్వాడు.

"సాయంత్రం కనిపించు."

"అలాగే."

రాజు గొడుగు తెరిచి ఇంటిదారి పట్టాడు. వరండాలో కాలు పెట్టాడో, లేదో "చిన్నాన్న! చిన్నాన్న" అంటూ పిల్లలు చుట్టుముట్టేశారు.

"చిన్నాన్నను లోపలికి రానివ్వరేమిటే ?" రాజు పెద్దవదిన పార్వతి నవ్వుతూ పిల్లలను మందలించింది.

"అంతా కులాసాయేనా, వదినా ?" కాళ్ళకు చుట్టుకున్న పెద్దన్న సాంబశివం కొడుకును చేతులోకి తీసుకుంటూ వాకిట్లో నిల్చున్న వదినవైపు చూసి అడిగాడు.

"అంతా కులాసాయే. వాణ్ణి ఎత్తుకోకు, రాజూ! మట్టిలో పొర్లాడి ఎలా ఉన్నాడో చూడు! బట్టలు పాడవుతాయి." నవ్వుతూ అంది.

"బట్టలకు మట్టయితే ఇక పోదేమిటి, వదినా ?" చంటి వాణ్ణి ముద్దుపెట్టుకొని అన్నాడు.

"డాక్టరుగారితో మనం మాట్లాడగలమా, అక్కయ్యా?"

అప్పుడే అక్కడికి వచ్చిన భారతి మరదివేపు చూసి నవ్వి అంది.

"మీ రిద్దరూ ఒక్కటయితే నేనెంత, చిన్నొదినా? పెద్దొదినా, అలా చిక్కిపోయావేం?" లోపలికి నడుస్తూ అన్నాడు.

"ఏం చిక్కాను?" బలహీనంగా నవ్వి అంది పార్వతి. లోపలికి వచ్చి మంచంమీద కూర్చోగానే పిల్లలంతా చుట్టూ చేరారు. బాగు తెరవగానే మొగలిచెండు చేతికి వచ్చింది. అసలు ఆ వస్తువు హక్కుదారు ఇంతవరకు కనిపించలేదేమిటి చెప్మా అనే ఆశ్చర్యంతో నలువంకలా కనుకొలకుల్లోనుండే కలయజూశాడు. తర్వాత తను కొన్న మల్లెపూల పొట్లం బయటపడింది.

"ఓహో! వదినలంటే మారాజు కెంత ప్రేమో!" పూలంటే ప్రాణాలిచ్చే భారతి మల్లెలపొట్లం సొంతం చేసుకుంటూ అంది.

"మల్లెపూలేమో మీ కొదినా! మొగలి చెండేమో..." మధ్యలోనే ఆగి భారతివైపు చూసి నవ్వాడు, మొగలిచెండుకూడా చిన్నొదినే సొంతం చేసుకుంటుందేమోనని భయపడి! భారతిముఖం క్షణంలో వివర్ణమైంది. పార్వతి తల బరువుగా తిప్పుకుంది.

"ఇక లేచి, స్నానం చేసిరా రాజూ! అన్నం పెడతాను" అంటూ అక్కడినుంచి బరువుగా అడుగులేస్తూ కదిలిపోయింది పార్వతి.

మల్లెల పొట్లం అక్కడే వదిలి పెరట్లోకి దారితీసింది

భారతి. రాజు స్థితి అయోమయంగా ఉంది. పిల్లలందరివైపూ చూశాడు ఏమిటన్నట్లు. ఉహుం...ఒక్కరన్నా జవాబు చెపేనా ?

"చిన్నాన్నా! మాకేం తేలేదూ ?" పార్వ పెద్ద కూతురు శశిరేఖ ముందు మాసంగతిచూడుఅన్నట్టు అడిగింది.

రాజు బాగులోనుంచి బిస్కట్ల పొట్లం తీస్తూ "ఎన్ని భాగాలు, శశీ ?" అన్నాడు.

"ఆరు, చిన్నాన్నా !" అంది శకీమని.

"ఆరా ! ఏడు కాదూ ?" అన్నాడు.

"అరే ! కావాలంటే లెక్కట్టు." చుట్టూఉన్న ఆరు మందినీ, మరొకసారి, తన నాలుగవ తరగతి లెక్కల పరిజ్ఞానంతో లెక్కపెట్టి అంది శశి.

పెద్దన్నకు నలుగురు, చిన్నన్నకు ఇద్దరు పిల్లలన్న సంగతి రాజుకు తెలీకపోలేదు. కానీ శశిమాటుకు తన పెద్ద కళ్ళల్లోనుండి ఆశ్చర్యాన్ని అలాగే కుమ్మరించింది, చిన్నాన్నకు ఆ మాత్రం తెలీదా అన్నట్టుగా !

"ఇంకోభాగం లాజు చిన్నాన్నకు" అన్నాడు శశి తమ్ముడు అక్కకు సాయం చేస్తున్నట్లు.

"ఉహుం. నాకాదు. మీ సుశీల పిన్నికి."

"సుశీల పిన్ని రానదుగా ?" శశి ప్రశ్న.

"ఏం ?" రాజు గుండెలు గుభిల్లుమన్నాయి.

"తలనొప్పట." శశికళ్లు పెద్దవిచేసి చెప్పింది.

"ఎప్పట్నుంచి ?" రాజు కర్థంకాలేదు. ఉదయ మేగా

చలపతికి మొగలిచెండు తెమ్మని చెప్పింది? ఇంతలో ఏమైంది.

"పొద్దున్నుంచే!" రాగం తీసింది శశి.

"ఓహో!" ఉత్సాహమంతా నీరుకారిపోయిన రాజు అంతకన్నా మరేం అనలేకపోయాడు

పార్వతి వచ్చి రెండుసార్లు హెచ్చరించగా వెళ్ళి స్నానంచేసి విస్తరి ముందు కూర్చున్నాడు రాజు

"పిల్లలంతా రమ్మనకూడదూ?"

"వాళ్ళకేం? ఎప్పుడూ ఏదో ఒకటి తింటూనే ఉంటారు." అన్నం వడ్డిస్తూ అంది.

"అయితే అన్నం తినగూడదేంటి? వాళ్ళనూ పిలు, వదినా, అందరం కలిసి తింటాము."

"ముందు నువ్వు కానివ్వు, రాజూ!"కఠినంగా అంది పార్వతి.

రాజు ఆశ్చర్యంగా తలెత్తి పార్వతివైపు చూశాడు. ఎప్పుడూ ఆప్యాయంగా మాట్లాడే పెద్దవదిన అమృతహృదయంలో ఇంతటి కాఠిన్యానికి తావెక్కడుందా అన్న ఆశ్చర్యం రాజునోటికీ, మనసుకూ తాళంవేసింది. మరొక్క మాటా మాట్లాడక మౌనంగా అన్నం కలపసాగాడు.

"నీ కిష్టమని పెరుగుపచ్చడి చేశాను. మరి కాస్త వేసుకో." అందులో అధికారమే ఉందో, వేడికోలే ఉందో అర్థంకాలేదు. అయినా పెద్దవదిన ఆప్యాయత ఈ రోజుదా? పదహైదుసంవత్సరాలక్రితం అమ్మ చనిపోయిన కొత్తల్లో ఈ ఇంట్లో అడుగుపెట్టిన పెద్దవదినకు తను తమ్ముడో,

కొడుకో ఏమవుతాడో తనకే తెలీదు. అయితే అందరూ అనుకుంటున్నట్లు మరిదిమటుకు కాదు. ఆ భావనలో హృదయం జివ్వుమంది. కళ్లల్లో నీళ్లు చిప్పిల్లాయి.

"వెయ్యనా, రాజూ?"

"వద్దు, వదినా!" కంఠం జీరబోయింది.

"ఏమిటలా కెలుకుతున్నావు! తినవయ్యా, బాబూ! రేపు......" పార్వతి ఠక్కున ఆగిపోయింది.

రాజు తలెత్తి చూశాడు. పార్వతి బలహీనంగా నవ్వింది. 'వదిన బాగా చిక్కిపోయింది' అనిపించింది.

"రేపు?" నొక్కి పృచ్ఛించాడు

"మరేం లేదు. రేపెవరన్నా చూసి పాపం వాళ్ళ వదిన అన్నం పెట్టుతుందా లేదా అని అనక మానరు."

"ఎవరో ఏదో అంటే ఏం వదినా? నువ్వెంత పెట్టావో, నేనెంత తిన్నానో, అది మనిద్దరికే తెలుసు." పార్వతి కళ్ళు దించుకుంది.

"వదినా?"

"ఊఁ......"

"సుశీ లేదీ?" చూపులు వి స్తరిమీంద పెట్టి అడిగాడు.

పార్వతి కళ్లెత్తి రాజు వేపు ఓక్షణం చూసింది. వదిన దగ్గర్నుంచి జవాబు రాకపోయేసరికి కళ్ళెత్తి భయంగా, బెరుగ్గా, బలహీనంగా అన్నాడు.

"వదినా!"

"తలనొప్పట" అంది కూర్చున్నదల్లా లేస్తూ."

"'ట'! నీకు తెలీదూ?"

"నన్నింకేం అడక్కు, బాబూ! మీకు కావలిస్తే పిలువు" అంటూ మరో మాట లేకుండా వెళ్ళిపోయింది.

రాజు తల తిరిగిపోయింది. తను భోజనం పూర్తి చేసే వరకూ పక్కనే కూర్చుని తినిపించే పెద్ద వదినేనా ఇప్పుడు తింటే తిను మానితే మానమని వెళ్ళిపోయింది? ఒక్క ముద్దకూడా నోట్లో పెట్టుకోలేకపోయాడు. లేచి వెళ్ళి చెయ్యి కడుక్కుని, వంటగది గుమ్మందగ్గర నిల్చునున్న పార్వతివైపు కోపంగా చూసి మూతి బిగించాడు. రెండు కన్నీటిబొట్లు 'టప్'మని రాలి విస్తట్లో పడగా రాజు వది లిన నిండు విస్తరి తీసికెళ్ళి బయటపడేసింది పార్వతి. రాజు కన్నీళ్లు బలవంతంమీద ఆపుకుని మంచంమీద ఒరిగాడు.

సుశీల విషయంలో వదిన ప్రవర్తన ఎందుకలా ఉందో తలబద్దలు కొట్టుకున్నా అర్థంకాలేదు. పెద్దన్నయ్య ఇంతవరకూ కంటికే కనిపించలేదు. చిన్నన్నయ్య స్కూలుకు వెళ్ళాడేమో, ఇక సాయంత్రమే కనిపిస్తాడు. సుశీల కంటికే కనిపించకపోవడంలోని అంతరార్థం? ఎంత తలనొప్పయితేనేంటూకు? ప్రతిసారీ రాగానే చిరునవ్వుతో పలకరించి కళ్ళతోనే ఆహ్వానించే సుశీల ఈసారి ఎందుకింత ముభావంగా ఉంది? పొద్దుటేకదా ఆకాశంలో తేలిపో తున్నదని చలపతి చెప్పింది. మరి ఏమిటి? తనమీద కోపమా? ఎందుకూ? తనకు తెలిసి ఉన్నంతవరకూ తను ఏ తప్పిదమూ చెయ్యలేదే? చేసిన తప్పును శిక్షవిధిస్తే

తను సంతోషంగా స్వీకరించేవాడుకదా ? ఒకవేళ ఇదే శిక్షేమో ?

అంత మనోవ్యాకులతలోనూ తన ఆలోచనకు నవ్వు వచ్చింది రాజుకు. సన్నగా నవ్వుతూ తలుపులు బిగించి ఉన్న గదివైపు ఒకసారి చూశాడు. రేపటికైనా దేవి ప్రసన్నురాలు కాకపోతుందా అన్న ఆశ లేకపోలేదు. సాయంత్రం మొగలిరేకులతో జడ వేసుకుంటుందో, లేదో !

మరయితే వదినెందుకు అలా ఉంది ? సుశీల నిజంగా తనమీద అలగడమంటూ జరిగితే—"మరిదీ! సుశీల అలిగిందయ్యా ! ఇక నీ ఇష్టం !" అంటూ కవ్వించేది. పెద్దవదిన కాకున్నా చిన్నవదినన్నా అలాంటి సూచన ఇచ్చేది. మరి చిన్నవదినకూడా అలా ముభావంగా ఎందుకుందో ?

భిన్నాభిన్నమైన భావాలు—ఉండి ఉండి కీడును శంకిస్తున్న హృదయము—వీటిమధ్య ఓ చిన్న కునుకు—ఆ కునుకులో పీడకల. బరువుగా కళ్లు తెరిచి చూచాడు. కలత నిద్రలోని పీడకలను తలుచుకొని హృదయం భయంతో గజగజలాడింది.

వంటగదిలోనుంచి అస్పష్టంగా మాటలూ, పిల్లల గోలా వినిపిస్తున్నాయి.

"జొన్న సంగటి నా కొద్దు." శశి మారాం చేస్తున్నది.

"రోజూ తినడం లేదూ ? ఈ రోజేమొచ్చింది ?" పార్వతి మెల్లగా దండిస్తున్నది.

"ఈరోజు అన్నం చేశావుగా ?"

"పాడుకళ్లల్లో పడిందీ? నీ కోసం చేశానేమిటి?"

"పోనీ ఉంటే కాస్త పెట్టరాదక్కయ్యా!" భారతి గొంతు.

"ఉంటే పెట్టక మనం తింటామా? నీకంటే చిన్న వాళ్ళంతా తినడం లేదూ? మజ్జిగ వేయనా?"

"నాకేం వద్దు."

"వద్దనుకుంటే వెళ్ళు." కోపంగా అంది పార్వతి.

చిరుబురులాడుతూ హాల్లోకివచ్చి మూతి ముడుచుక కూర్చుంది శశి. రాజు కళ్ళల్లో అప్పటికే నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి.

"శశీ!" గద్గదకంఠంతో పిలిచాడు.

శశి కళ్ళు తుడుచుకుంటూ రాజు దగ్గరకు వెళ్ళింది.

"రోజూ జొన్న సంగటేనా చేసేది?"

శశి అవునన్నట్లుగా తల ఆడించింది.

"నీ కిష్టం లేదూ?"

"ఊహుఁ..."

"అందరూ అదే తింటారా?"

శశి మాట్లాడలేదు.

రాజు బరువుగా మూలిగాడు. ఇందు కేనన్నమాట వదిన తనతోపాటు పిల్లలకు అన్నం పెట్టనిది. హృదయం మెలి కలు తిరిగిపోయింది. కనుకొలకుల్లో ఒక కన్నీటిబొట్టు నిలి చింది. అంధకారంగా, అజ్ఞానంగా, నికృష్టంగా, హీనంగా ఉన్న ఆ సంసారరంగానికి దట్టంగా, నిండుగా కప్పబడిన తెరలను చీల్చుకుని ఆత్రంగా, బెరుగ్గా, బాధగా పరుగెత్తి

పోతున్నది మనసు. చివరకు కనిపించిన దృశ్యం! బాధా కరమైనది. హృదయాన్ని పిండి రక్తపుముద్దుగు చేసింది. విలవిల్లాడిపోయాడు. లేచి శశిని రెండు చేతులతో దగ్గరకు తీసుకొని హృదయానికి హత్తుకున్నాడు.

"చిన్నాన్నా!"

"ఏం?" శశి నొసలు ముద్దుపెట్టుకుని అడిగాడు.

"నాకు పరికిణీ తెస్తానన్నావు. తెచ్చావా?"

"మరిచిపోయానమ్మా, శశీ! చిన్నాన్న నిప్పటికి క్షమించు. రేపు తప్పక తెచ్చిపెడతాను." గొంతు వణికింది.

"ఎప్పుడూ ఇంతే!" చెప్పింది.

'లేదు. రేపు తెస్తాను. నీ చెయ్యిలా ఇవ్వు. ఒట్టేస్తాను."

శశి చెయ్యి చాచింది.

రాజు ఒట్టు వేశాడు.

"రెండు చిన్నాన్నా! ఇది చూడు ఎలా చిరిగిపోయిందో?"

"నీకెన్ని పరికిణీలున్నాయి?"

"రెండే. ఇదేమో అంతా చిరిగిపోయింది."

"ఓ!"

"రెండు కుట్టించవూ?" ప్రార్థన.

"సుశీల పిన్ని కెన్ని చీర లున్నాయి?"

"రెండేగా?" ఆమాత్రం తెలీదా అన్నట్టు.

మీ అమ్మ కెన్నున్నాయి? అని అడగలేకపోయాడు.

అడిగితే వచ్చే జవాబేమిటో తెలుసు. ఆ నగ్నసత్యం మనసుకు తెలిసినా శశి నోటంట వినడానికి భయపడ్డాడు. అందుకే మరేం మాట్లాడలేకపోయాడు. హృదయం బరువుగా వుంది. మేధ తన అస్థిత్వాన్నే మరిచిపోయినట్లయింది.

"నామాట వినేటట్లయితే నీకు పరికిణీలు కుట్టిస్తాను, శశీ!" అన్నాడు ఓ క్షణం తర్వాత.

శశి ఏమిటన్నట్లు చూసింది.

"ముందు వెళ్ళి అన్నం తిను."

శశి మూతి ముడుచుకొని అయిష్టంగానే వెళ్ళింది. వంటగది గుమ్మంలో శశిని చూడగానే "శశి బంగారు! రా! రా! అందరూ తినేశారు. చిన్నాన్నకు చేసిన పెరుగు పచ్చడి నీకే వేస్తానురా!" అంది అనునయంగా పార్వతి.

రాజు ఇక అక్కడ కూర్చోలేక నిప్పులు చెరుగుతున్న ఎండలోనే గబగబా అడుగులేసుకుంటూ వెళ్ళాడు.

సాయంత్రం ఆరుగంటలు కావస్తున్నది. సూర్యుడు పశ్చిమ దిక్కుకు పూర్తిగా వాలిపోయాడు. అంతవరకు ఎండతీక్ష్ణతకు బాధపడిన ప్రాణులకు సాయంత్రపు చల్లని గాలులు మనసుకు హాయిగా ఉన్నాయి. ఆలమందలు ఇంటిముఖం పట్టాయి. పక్షుల ఆహారాన్వేషణ చాలించి గూళ్ళకు చేరుకుంటున్నాయి.

రాజు చలపతిదగ్గర శెలవు తీసుకుని ఇంటిముఖం పట్టాడు. వరండాలో అడుగు పెట్టగానే రాజు చిన్నన్న రామ్మూర్తి చుట్టకాలుస్తూ కనిపించాడు.

"ఎప్పుడొచ్చావు?" చుట్ట నుసి రాలుస్తూ అడిగాడు.

"ఇప్పుడే!"

"ఇప్పుడా?"

అసలు రామ్మూర్తి వాకిట్లో ఉండగానే "రాజు చిన్నాన్నవచ్చా"డంటూ పిల్లలు చెప్పేశారు. తక్కిన వివరాలన్నీ భారతి క్షుణ్ణంగా వివరించింది. తమ్ముణ్ణి పలకరించను సమయానికి మరో ప్రశ్న దొరక్క సామాన్యమైన ఆ ప్రశ్ననే వేశాడు రామ్మూర్తి. కానీ రాజు ఇచ్చిన జవాబు రామ్మూర్తిని ఆశ్చర్యపరిచినా, రాజు ఈ లోకంలో లేడన్న విషయాన్ని మటుకు స్పష్టపరిచింది.

"ఊఁ... చిక్కిపోయావేం?"

"ఎండలు." మొదటి ప్రశ్నకిచ్చిన జవాబుకు సిగ్గుపడి రెండవ ప్రశ్నకన్నా సరైన జవాబివ్వాలని గొణిగాడు.

"పక్క పల్లెకు ట్రాన్సఫరయిందటగా?" తనొక్క ప్రశ్నన్నా వెయ్యకుంటే బాగుండదని ఆ ప్రశ్న వేశాడు.

"అవును. పొద్దునపోతే సాయంత్రమే ఇక ఇంటికి రావడం." నిట్టూర్చి అన్నాడు.

రాజు మాట్లాడకుండా నిలుచున్నాడు.

"వెళ్ళు. వెళ్ళు. కాఫీ కాచి నీకోసం గంటనుండీ చూస్తున్నారు."

నెమ్మదిగా లోపల కడుగు వేశాడు రాజు. వంటగది గుమ్మందగ్గర కూర్చుని పొట్లకాయ తరుగుతున్న భారతి దూరాన్నుంచే రాజునుచూసి, "రాజు వచ్చాడక్కయ్యా!" అంది పార్వతితో. పార్వతి కాఫీ వెచ్చజేసి తీసుకువచ్చింది.

"వద్దు." ముఖం తిప్పుకుని అన్నాడు రాజు.

"ఏం?"

"మీ కంతా లేనిది నాకుమటు కెందుకు?"

"మా కంతా లేదని నీకేం తెలుసు?" సన్నగా నవ్వుతూ అంది.

"తెలుసు. ఎన్నిరోజులు తెలీకుండా ఉంటుంది? మూర్ఖుణ్ణి కనుక కాస్త ఆలస్యంగానే తెలిసింది." నిష్ఠూరంగా అన్నాడు.

పార్వతి ముఖం పాలిపోయింది. నెమ్మదిగా తేరుకుని "మా కంతా అలవాటు లేదయ్యా బాబూ! రేపు నువ్వు డాక్టరు వయ్యాక..." అన్నది.

"వదినా!"

పార్వతి తెల్లబోయింది.

"ఇక ఆ మాట అనవద్దు."

పార్వతి నిశ్చేష్ట అయింది. కాసేపు శిలాప్రతిమలా అలాగే నిల్చుండిపోయింది.

వికలమైన మనసుతో అక్కణ్ణుండి పెరట్లోకి దారి తీశాడు రాజు.

"చిన్నాన్నా! నా మొగలి రేకుల జడ చూడూ! బాగా లేదూ?" నిచ్చెన వేసుకుని జాజిమొగ్గలు తుంపుతున్న శశి రాజును చూడగనే సంతోషంగా అంది.

"బాగుంది" అన్నాడు శశి జడవైపు చూస్తూ.

"పిన్ని వేసుకోనంది." పందిరి క్రింద కూర్చుని జాజి

మొగ్గల మాల కట్టుతున్న సుశీలవైపు చురచురా చూస్తూ అంది శశి.

ఎందుకు వేసుకోలేదు ? — అన్నట్టు సుశీలవైపు చూస్తూ హృదయంలోని ఆప్యాయతనంతా చూపులగుండా కుమ్మరించాడు రాజు. సుశీల నెమ్మదిగా కళ్ళు దించుకుంది.

"తలనొప్పి తగ్గిందా, సుశీ !" పందిరిదగ్గరగా వచ్చి సుశీల ముఖంలోకి పరీక్షగా చూస్తూ అడిగాడు. ఉత్సాహమే రూపుగొన్నట్లుండే సుశీల ఎందుకనో నిరుత్సాహానికి ప్రతినిధి అయిపోయింది.

సంతోష సుగంధానికి, సౌందర్య లాలిత్యాలకు స్థావరమైన ఆ వదనసరోజం విషాదాన్ని వెదజల్లుతూ, వాడి తూలిపోయింది. సర్వకాలాలయందూ ప్రఫుల్లంగా ఉండే ముఖపద్మం (రాజుదృష్టిలో—ప్రకృతికి విరుద్ధమైనా సరే) ఈ రోజు ముకుళించుకుపోవడం మొదటిసారిగా చూస్తున్నాడు. రేకుల నన్నింటినీ కన్నులు చేసి కమలబాంధవుని కోసం ఎదురుచూచే కమలిని అతని కరస్పర్శకు కినుక వహిస్తుందా ? ప్రకృతి స్వభావానికి పూర్తిగా విరుద్ధం. మరి ముకుళించిన సుశి ముఖసరోజానికి అర్థం ?

"తగ్గలేదా ?" ఆలోచనలనుంచి తేరుకుని అడిగాడు.

నెమ్మదిగాతలఆడించింది. అవునన్నట్లో? కాదన్నట్లో?

"చిన్నాన్న పిలుస్తుంటే మాట్లాడవేం ?" నిచ్చెన మీదనుండే పూలు సుశీల ఒళ్ళోకి వేస్తూ శశి గద్దించింది.

"ఏం మాట్లాడాలి?" నీరసంగా నవ్వి శశి ముఖం లో చూసి అంది.

ఏం మాట్లాడాలి ?

రాజు స్తంభించిపోయాడు తనతోపాటు సర్వ జగత్తూ స్తంభించినట్లయింది. చల్లని పిల్లగాలులు వీస్తూన్నా శరీరమంతా చెమట పట్టినట్లయింది. ఏవిటి దీనికంతా అర్థం ? మస్తిష్కం పదేపదే వేస్తున్న ప్రశ్న అదొక్కటే.

"సుశీ! మాట్లాడాలంటే మాటలే లేవా ?"

ఆవేదన మారుమ్రోగింది.

"ఏవున్నాయి ?"

ఏవున్నాయి ! గుండెలు వ్రయ్యలయ్యాయి.

"కనీసం అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పాలని."

రాజు ఇక మాట్లాడలేకపోయాడు. గొంతు గాద్గద్యం వహించి రాజుతో సహకరించను నిరాకరించింది.

సుశీల కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. తలెత్తి రాజు ముఖంలోకి చూడలేకపోయింది.

"ఇక మాట్లాడవన్నమాట ?" తన్ను తాను తమా యించుకొని అడిగాడు.

శశి పూలుకోయటం మాని ఆశ్చర్యంగా చూస్తు న్నది. అప్పుడే పెరట్లోకేదో పనిమీదవచ్చిన భారతి ఓ క్షణం తటపటాయించి,—"సుశీలా !" అంది తిరిగి లోప లికి వెళ్ళుతూ. సుశీల తలవంచుకొని మౌనంగా వెళ్ళి పోయింది.

"శశీ !" ఆక్రోశించాడు.

"ఏమిటి, చిన్నాన్నా!" చిన్నాన్న ఎందుకలా ఉన్నాడో అర్థంకావటంలేదు శశికి. సుశీల పిన్ని మాట్లాడితే ఏం?

"సుశీల పిన్ని ఎందుకలా ఉంది?"

"తలనొప్పిగా?" అమాయకంగా ప్రశ్నించింది.

"ఊహుఁ...కాదు."

"అవును, చిన్నాన్నా!"

"నీకు తెలీదు."

అక్కడే, శశిముందే — మధ్యాహ్నంనుండీ హృదయంలో పేరుకుని మోయలేనంత బరువుగా తయారయిన ఆ వేదనను కన్నీటిరూపంలోకి మార్చి ప్రక్షాళనం చెయ్యాలన్న గాఢమైన కోరిక కలక్కపోలేదు రాజుకు. కాని, అభిమానమూ, అభిమానంతోపాటు తను మగవాడనన్న భావమూ ఆ ప్రయత్నాన్ని దూరం చేశాయి.

విరిగిపోయిన మనసు—

చెదిరిపోయిన ఆలోచనలు—

భవిష్యత్తుమీద అపనమ్మకం—

జీవితంమీద విరక్తి—

అవీ ఆ క్షణంలో మిగిలాయి.

మర్నాటి మధ్యాహ్నానికల్లా సాంబశివంవచ్చాడు. రాజును చూడగానే చిరునవ్వుతో పలకరించాడు.

"సాయంత్రం ఎక్కడికీ వెళ్ళకు. నీతో మాట్లాడాలి." రెండునిమిషాల్లో భోజనం ముగించుకుని తిరిగి పని మీద వెళ్ళుతూ చెప్పాడు సాంబశివం,

"రాత్రీ భోజనం చెయ్యకపోతివి. ఇక అన్నానికి రావయ్యా. మరిదీ !" భారతి నవ్వి అంది.

"అన్నయ్యతో పాటు నాకూ పెట్టవలసింది." వదిన లిద్దరి ముఖల్లోకి పరీక్షగా చూస్తూ అన్నాడు.

పార్వతి చూపులు తిప్పుకుని "మరిదికి ప్రత్యేకమైన వంటకాలు వడ్డిస్తామని !" అని సాగదీసింది.

"అలాగే ఉంది చూస్తుంటే!" ముఖం చిట్లించి అన్నాడు.

"చూద్దువుగాని. రా" అంది లేచి వంటింట్లోకి నడుస్తూ.

రాజు వెళ్ళి విస్తరిముందు కూర్చున్నాడు.

పార్వతి అన్నం పెట్టబోయింది.

"వద్దు." వారించాడు.

"ఏం!" ఆశ్చర్యపోయింది.

"మీరంతా ఏం తింటారో అదే పెట్టు."

"అదే పెట్టుతున్నాను."

"అబద్ధాలాడకొ వదినా!"

"అందరి విషయం వేరు."

"ఎందుకనో?"

"నీకూ, వాళ్ళకూ భేదం లేదూ?" కంఠంలో అనునయింపు.

"ఏవిటో?" వ్యంగ్యం.

"నువ్వు నా ముద్దుల మరిదివి."

"ఇంకా..." బొమముడి అల్లలాడింది.

"కాబోయే డాక్టరువు."

"ఊఁ...?" కళ్ళు కోపాన్ని కుమ్మరించాయి.

"సుకుమారుడివి." నవ్వింది.

నవ్వుతో మరిది కోపాన్ని మరిపించాలని పార్వతి ప్రయత్నం.

"అంతేకా దొదినా! ఇంతమంది సుఖాన్ని, సంతోషాన్ని నా ఒక్కడి సుఖంకోసం, నా ఒక్కడి అభివృద్ధికోసం ఏమాత్రం సంకోచపడక దోచుకుంటున్న స్వార్థపరుడు! రాక్షసుడు! ఆమాట చెప్పాదినా!" ఆవేశంతో ఊగిపోయాడు.

అన్నం పళ్ళెం చేతిలో పట్టుకుని నిలబడిఉన్న పార్వతి, వంటగది గుమ్మం ఆనుకుని నిలబడిఉన్న భారతి ఓ నిమిషంపాటు చిత్తరువుల్లా ఉండిపోయారు.

"వద్దొదినా! ఇంకే చదువొద్దు."

ఆవేశమంతా అణగారిపోగా, ఆవేదన గొంతులో ప్రతిధ్వనించగా, చెక్కిలిమీద జారిన కన్నీటిని కొనగోటితో తుడిచివేసుకుంటూ, అస్పష్టంగా గొణిగాడు.

తోడికోడళ్ళిద్దరూ ఒకరిముఖంలోకి మరొకరు చూచుకొన్నారు. అర్థంకోసం అన్వేషించారు. తమ అన్వేషణ అర్థరహితమని చివరకు మరిది ముఖంలోకి చూపులు బరపారు.

"రాజూ!" పార్వతే ముందుగా తేరుకుంది.

"వదినా! ఇన్నాళ్ళూ ఇన్ని విషయాలు ఎలా దాచగలిగారు?"

"ఈ సంవత్సరం కరువు! పంటల్లేవు."

"అన్నయ్య ఐదెకరాలు అమ్మేశాడటగా?"

"ఎప్పుడూ!" ఆశ్చర్యం చూపింది.

"ఇక దాచకు, వదినా! పోనీ, నువ్వు చెప్పు, చిన్నొదినా?" విసుగ్గా అన్నాడు.

భారతి పార్వతిముఖంలోకి చూసింది.

"అమ్మవలసొచ్చింది, రాజూ !" తలతిప్పి అంది పార్వతి.

"ఎందుకూ?"

"అప్పు."

"అప్పెందుకయింది?"

"మనకు సరిగ్గా పంటలెక్కడ పండుతున్నాయి?"

"నా చదువుకా్కదూ?" నిలవేశాడు.

ఆ క్షణంలో జవాబు లేకపోయింది పార్వతికి.

"అలాగని ఎలా చెప్పగలవు? తిండికీ, చదువుకూ అన్నింటికీ." కాసేపటికి కళ్ళుదించి అంది పార్వతి.

"తిండి! ఏం తిండి!" వెక్కిరించాడు.

ఈసారి పార్వతికి జవాబు లేకపోయింది.

"ఇక ఉన్న పొలమెంత? ఐదెకరాలు! ఈ కడప జిల్లాలో, అందులోనూ మన పల్లెలో ఒక సంవత్సరం పండితే రెండు సంవత్సరాలు కరువుతో బాధపడవలసినచోట ఐదెకరాలతో కుటుంబం నెట్టుకు రావాలంటే మాటలా? ఈ ఐదెకరాలకున్న విలువెంత? మంచి ధర పలికితే మూడు

నాలుగు వేలు! నేనింకా ఐదు సంవత్సరాలు చదవాలి. పూర్తి చెయ్యను ఎన్ని వేలు కావాలి? ఎలా వస్తుంది?"

"మీ చిన్నన్నయ్యకు వస్తుందిగా?" భారతి కల్పించుకుంది.

"ఎంత? చదివింది సెకండరీ గ్రేడు. తీసుకుంటున్నది హాయ్యర్ గ్రేడు స్కేలు! పక్కపల్లెకు రోజూ నడిచివెళ్ళి వచ్చిందానికి ఇవ్వవచ్చు అరవై రూపాయలు! పోనీ, అలా చూసుకున్నా ఆ అరవై నా హాస్టల్ ఫీజుకూడా చాలదే!"

దానికి ఇద్దర్లో ఒక్కరూ జవాబు చెప్పలేకపోయారు.

"పోనీ, ఈ విషయాలన్నీ అలా వదిలెయ్యి. ఉదయం నుంచీ సుశీల కనిపించదేం? అసలేం జరిగింది? అన్నయ్య ఉన్నపళంగా నన్నెందుకు రమ్మన్నట్టు?"

"నన్నడక్కు, రాజూ! అవన్నీ నాకు తెలీదు." గోడనానుకుని బలహీనంగా అంది పార్వతి.

"తెలీదా? ఆమాటనకు, వదినా! ఈ యింట్లో నీకు తెలీని విషయం ఒకటన్నా ఉంటుందా? బహుశా నాకు చెప్పడం ఇష్టంలేదు కాబోలు!" బాధాతప్త కంఠంతో అన్నాడు.

"అలా అనకు, రాజూ! ముందు అన్నం తిను."

"నాకు చెప్పకూడని రహస్యాలు నీకున్నాయని ఈ రోజే మొదటిసారిగా తెలుసుకుంటున్నాను." నిష్టురతనూ, నిందనూ మేళవించి అన్నాడు.

"రహస్య మేముంది? సాయంత్రం మీ అన్నయ్యే వచ్చి చెప్తారుగా?"

"అంతవరకూ రహస్యమన్న మాట!"

"పోనీ, అలాగే అనుకో. ఇక అన్నం పెట్టనా?"

"అన్నం వద్దు."

"ఆ జొన్న సంగటి నీకు జీర్ణం కాదు." పార్వతి గొంతు కంపించింది, అతి మెల్లగా.

"అదీ చూస్తాను."

పార్వతి అలాగే నిలబడిపోయింది నిశ్చేష్టగా.

"అక్కయ్యా! ఇక ఆ మొండిఘటంతో మనం మాట్లాడలేము. అడిగిందే పెట్టు" అంది భారతి.

"నువ్వే పెట్టు" అంటూ అక్కణ్నుండి వెళ్ళిపోయింది పార్వతి.

సంధ్య సిగ్గుల పెళ్ళికూతు రయింది. చేరువైన ప్రియుని కన్నుల్లోని అనురాగరేఖలు అసలే అరుణమైన ఆమె ముఖాన్ని మరింత రాగరంజితం చేశాయి. రాజు వరండాలో కూర్చుని వింతవింత రంగులతో సుశోభితంగా ఉన్న విశాలాకాశంవైపు చూస్తున్నాడు. చూపులైతే ఆకాశం మీదున్నాయిగానీ, మనసంతా 'పెద్దన్నయ్య ఎప్పుడు వస్తాడు? ఏం చెప్తాడు?' అనే విషయంమీదే కేంద్రీకరించబడిఉంది.

రాజు ఎదురు చూస్తున్నట్టుగానే సాంబశివం రానే వచ్చాడు. రామ్మూర్తి సాంబశివం వెనకే వచ్చాడు. రాజు వరండాలో ఉన్న స్తంభాన్నానుకొని కూర్చున్నాడు. రామ్మూర్తి మరో స్తంభానికి జేర్లబడి బీడీ వెలిగించాడు.

"అన్నయ్యా! ఏవిటో మాట్లాడాలన్నావు?" రాజు విషయం కదిపాడు.

"పార్వతి ఏం చెప్పలేదా?" చుట్ట వెలిగిస్తూ అన్నాడు— చెప్పబోయే విషయానికి నాందిలా.

"లేదు." ముభావంగా అన్నాడు.

"ఉదయాన్నే ప్రయాణానికి సిద్ధంగా ఉండు" అన్నాడు విషయమంతా చెప్పినట్లు, ఇక నేం చెప్పనవసరం లేదన్నట్లు, అదే భరతవాక్య మన్నట్లు.

రాజు ఆశ్చర్యానికి ప్రతిరూపై ఇద్దరన్నలవైపు మార్చి మార్చి చూశాడు కొన్నిక్షణాలపాటు. కాసేప టికి తేరుకుని నెమ్మదిగా "ఏ ఊరికి? ఎందుకూ?" అన్నాడు.

"చిత్తూరుకు." చుట్ట నుసి రాలుస్తూ అన్నాడు.

"ఎందుకూ?"

"పెళ్ళిచూపులకు."

డబ్బు చిక్కులవల్ల అన్నయ్యమనసు కాస్త స్థిరత్వం తప్పిందేమోనన్న భావన ఒక్కటే ఆ క్షణంలో రాజుకు కలిగింది.

"ఏవిటి, చిన్నన్నయ్యా?" ఆ భావంతోనే రామ్మూర్తిని ప్రశ్నించాడు.

"అవున్రా!" అన్నాడు అంతకన్నా ఎక్కువ తనకు తెలీదన్నట్లు, తెలిసికోవలసిన అవసరం లేదన్నట్లు.

"మీరు చెప్పేదేమిటో నాకర్థం కావడంలేదు.

పెళ్ళిచూపులకు వెళ్ళేది ఎవరు?" ఇద్దర్లో ఎవరు జవాబు చెప్పినా తనకు సమ్మతమే నన్నట్లు చూశాడు.

"నేనూ, కాదు. రామ్మూర్తీ కాదు. ఆమాట కాస్త పెద్దగా అంటే పార్వతీ, భారతీ ఇద్దరూ వచ్చి ఇక్కడే పెళ్ళిచూపులు ఏర్పాటు చెయ్యగలరు." పెద్దగా నవ్వి అన్నాడు సాంబశివం.

"మరి నాకేనా పెళ్ళిచూపులు! ఆమాట వింటే సుశీలమటుకు........."

"రాజూ!" సాంబశివం మధ్యలోనే అడ్డుపడ్డాడు.

"ఏం?"

"సుశీల నిన్ను చేసుకోనంది."

"అన్నయ్యా!"

"అవున్రా!" విచారంగా అన్నాడు.

"సుశీల నన్ను చేసుకోనందా?" ఆ వాక్యంలోని ప్రతి పదాన్ని, ప్రతి పదంలోని ప్రతి అక్షరాన్ని నొక్కి పలికాడు

"కావలిస్తే అడుగు."

రాజు తలతిప్పి గుమ్మంవైపు చూశాడు. పార్వతి గుమ్మానికి ఆనుకుని నిల్చుని రాజువైపే చూస్తూంది. చివ్వున అక్కణ్నుంచి లేచి పార్వతి దగ్గరికి వచ్చి "వదినా! నువ్వన్నా చెప్పు" అన్నాడు కంపిస్తున్న కంఠంతో.

"నిన్న మీ పెద్దన్నయ్యతో చెప్తుంటే విన్నాను, రాజూ!" అంది బరువుగా.

"నమ్మను. నమ్మలేను" అన్నాడు విషణ్ణవదనంతో

"సుశీలా! ఒక్కసారి ఇలారా! నీ నోటితోనే ఆ విషయాన్ని మీ రాజు బావకు చెప్పు" విషాదంగా నవ్వుతూ అంది.

సుశీల నెమ్మదిగా గదిలోనుంచి వచ్చి కాలి బొటన వేలితో నేలరాస్తూ నిల్చుంది.

"సుశీ! నన్ను చేసుకోనని తమాషాకన్నావు కదూ?"

"కాదు."

"నిజంగానే అన్నావా?"

"అవును."

"నిజంగానే....."

సుశీల వెళ్ళిపోయింది, ఇక తను చెప్పేదేమీ లేద న్నట్లు ఆ వెళ్ళడంలో తన హృదయపేటికలో భద్రంగా దాచిన అనురాగ విపంచి సుతారపు తీగలను క్రూరంగా తెంపి మరీ వెళ్ళినట్లనిపించింది రాజుకు. తల గిర్రున తిరిగి పోయింది. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. ఒక్క అంగలో వరండాలోకి వచ్చి స్తంభానికి అంటుకుపోయాడు.

చీకటి తెరలు దట్టంగా కమ్ముకున్నాయి.

ఆ చీకటి తెరల్లో— అంతకన్నా చీకటయిపోయిన తన ఆశలనూ, ఆశయాలనూ, అనురాగాన్నీ, అంతఃకర ణనూ, భవిష్యత్తునూ, జీవితాన్నీ, ముఖ్యంగా కన్నీటిని దాచుకోవాలని రాజు ప్రయత్నం. అదే చేశాడుకూడా.

ఆ రాత్రంతా మంచంలో అటూ యిటూ కదులు తూనే ఉన్నాడు రాజు. ఎక్కడలేని ఆలోచనలూ, ఎనలేని

దుఃఖమూ నిద్రాదేవిని దూరం చేశాయి. గడిచిన మధుర క్షణాలన్నీ ఒక స్మృతి. కేవలం ఒక కల. గతం గతించి పోయినా గుర్తుకు రాకమానదు. అందులోనూ గతం మధురమై, వర్తమానం బాధాకరమై, భవిష్యత్తు అగమ్యమైనప్పుడు.తనకూ, సుశీలకూ మధ్యనున్న బంధం ఈ రోజుదా? ఓ! జన్మజన్మాల అనుబంధం. అక్కయ్య సుశీలను పురిటి వాసనల్లోనే వదిలి శాశ్వతంగా వెళ్ళిపోయాక, బావ దేశాల మీద పడ్డాడు పిరికివాడై. పొత్తిళ్ళలోని సుశీలను అమ్మే తీసుకువచ్చింది. తనకప్పుడు మూడు సంవత్సరాలుండవచ్చు. అమ్మ వెళ్ళుతూ సుశీల భారాన్ని, తన భారాన్ని వదిన మీద వేసి మరీ వెళ్ళింది. వదిన తామిద్దర్నీ తన బిడ్డల్లాగే పెంచింది. ఇంకా ఎక్కువగానే అని చెప్పవచ్చు. శరీరాలు రెండు, హృదయం ఒక్కటి అనిపించేటంత స్నేహం తమది. ఏ ఆకర్షణకూ, ప్రలోభానికీ అందులో స్థానం లేదు.

అందానికీ, వయసుకూ, అంతస్తుకూ, ఐశ్వర్యానికీ, చదువుకూ, హోదాకూ అన్నింటికీ అతీతమైంది — ఆ స్నేహం. హృదయాల కలయిక, అవి మాట్లాడే భాష — దాన్నేమంటారో తనకు తెలీదు — అది స్నేహమో, ప్రేమో లేక మరొక పేరేదన్నా ఉందో తనకు తెలీదు. తెలుసుకోవాలన్న కోరికా తనకు లేదు. తను అనుకున్నది మటుకు సుశీల జీవితాంతమూ తన స్నేహాన్నే కోరుతుందని. అవును ... ఆ నమ్మకపు పునాదిమీదనే మధురమైన స్వప్నాలు సౌధాలై గర్వంగా తలెత్తి చూశాయి. ఆ నమ్మకపు కోనేటిలోనే తీయని కోరికలు రాయంచలై విహా

రించాయి. ఆ నమ్మకపు విశాలాకాశంలోనే ఆశలన్నీ విహంగాలై ఎగిరాయి.

కానీ, ఈ రోజు మిగిలిందేవిటి? క్షణికమైన ఉద్రేకంలో సుశీల తన్ను తిరస్కరించిందా? అలా ఎప్పటికీ జరగదు. క్షణికోద్రేకానికి లొంగిపోయేటంతటి అవివేకి, అజ్ఞాని కాదు సుశీల. పూర్తిచేసింది ప్రాథమిక విద్యే అయినా, సంపాదించిన విజ్ఞానం తక్కువేమీ కాదు. సాహిత్యంలో తమ ఇద్దరి పరిచయాలూ పరీక్షకు పెడితే, తను ఓడిపోవడం మటుకు వాస్తవం. అంతేకాదు. సుశీల ఆలోచనా విధానం తన కొక్కొక్కసారి ఆశ్చర్యాన్ని కలిగించేది. అంత లోతుగా, సునిశితంగా ఎలా ఆలోచించగలిగేదో తన ఊహకు అతీతం. అలాంటి సుశీల ఈ రోజు తన్ను కారణం లేకుండా నిరాకరించిందని ఎలా అనుకోవడం?

కారణం ఏమైవుంటుంది? ఎవరి బలవంతంమీద నన్నా అలా చెప్పిందా? అంత బలవంతంచేసేవా ళ్ళెవరున్నారు? దానివల్ల ఎవరికి లాభం కలుగుతుంది. ఊహుఁ... తనకు తెలిసినంతవరకూ అలాంటివా ళ్ళెవరూ లేరు. మరి?

ఒక హద్దంటూలేని ఆలోచనలు ఎటంటే అటు సాగి పోతున్నాయి. వాటిని ఓ మార్గంలో పెట్టి ఒక నిర్ణయానికి తను రాలేకపోతున్నాడు. హుఁ! జీవితం... క్షణంలో ఎంతగా మారిపోతుంది? తీవ్రమైన ఆలోచనలవల్లా, నిద్ర లేమివల్లా కళ్ళు మండుతున్నాయి. సన్నగా తలపోటు ప్రారంభమైంది. గాలి స్తంభించిపోయిందా అన్నట్టు ఒక్క ఆకన్నా కదలడం లేదు.

మెల్లగా అడుగులేసుకుంటూ పెరటి గుమ్మంవైపు నడిచాడు. గడియ తీసే ఉంది. కించిత్తు ఆశ్చర్యపోయాడు. ఈ వేళప్పుడు ఎవరు వెళ్ళి ఉంటారు అని ఆలోచిస్తూ నిల్చుండి పోయాడు. నిమిషాలు జరిగిపోతున్నాయి. ఒక్కరూ రాలేదు. తలుపుతీసి పెరట్లోకి పారజూశాడు. కృష్ణపక్షపు నవమి వెన్నెల లేతగా, సన్నగా కురుస్తూంది. ఆ లేవెన్నెల వెలుగులో బావిగట్టు నానుకుని శూన్యంలోకి చూస్తున్న సుశీలను చూశాడు. వెయ్యి అనుమానాల కాలసర్పాలు ఒక్కసారిగా బుస్సున లేచాయి మస్తిష్కంలో. హృదయం బరువుగా, బాధగా మూలిగింది.

"సుశీ!" దగ్గరగా వెళ్ళి నెమ్మదిగా పిలిచాడు.

"ఓ! నువ్వా!"

"ఆలోచనలకు అడ్డుపడ్డందుకు క్షమించు."

సుశీల మాట్లాడలేదు. తల పక్కకు తిప్పుకుంది.

"బావిదగ్గర నిలుచున్నావేం?"

"పడాలని కాదు. అంత పిరికిదాని క్రింద జమకట్టకు." నవ్వలేక నవ్వి అంది.

అందుకు నిరుత్తరుడే అయ్యాడు.

"ఒక్క విషయం అడగాలనుకుంటున్నాను." నెమ్మదిగా తేరుకుని అన్నాడు.

"అడుగు."

"నువ్వు చెప్పిన మాటలలో ఎవరి బలవంతం లేదు కదా?"

"లేదు."

"నీకై నువ్వు నిరాకరించావు?"

"అవును."

"కారణం?"

సుశీల జవాబు చెప్పలేదు. తలెత్తి రాజు ముఖంలోకి ఒక్క చూపు చూసి తలదించుకుంది.

"అందంగా లేననా?" వ్యంగ్యం.

"కావచ్చు."

"ఇన్నిరోజులూ ఆ విషయం తెలీదూ?" రెచ్చిపోయాడు.

"తెలీదు."

"రెండు కళ్ళూ..."

"ఉన్నాయి." మధ్యలోనే అందుకుంది. "పొరపాటు జరిగిపోయింది. క్షమించు." వెళ్ళేందుకు అడుగు ముందుకు వేసింది.

"ఆగు."

ఆగింది.

"ఇంకెవర్ని చేసుకోవాలని?" ఈర్ష్య మెలికలు తిరిగింది.

"అదేం ప్రశ్న?" నవ్వింది.

"నాలాంటి అభాగ్యుడెవడో జీవితాన్ని నరకం చేసుకోబోతున్నాడేమోనని భయం! వీలైతే హెచ్చరిక చేద్దామని!" తన క్రూరత్వానికి తనకే సిగ్గేసింది.

"అలాంటి భయమేం అక్కరలేదు." నిర్జీవంగా అంది.

"మరి నా అంతటివాణ్ణి కొనుక్కోవాలంటే ఎంత డబ్బుకావాలో తెలుసా?" క్రూరంగా, కఠినంగా అన్నాడు.

తెలుసన్నట్లు మెల్లగా తల ఆడించింది.

"ఎలా వస్తుంది?"

సుశీల జవాబు చెప్పలేదు.

"నన్ను నిరాకరించడంలో అర్థమేమిటి? నాకన్నా అన్నివిధాలా అధికుణ్ణి చేసుకోవాలనేగా?"

"కావచ్చు."

"మరి?" క్రూరమైన నవ్వు.

ఆ లేత వెన్నెల వెలుగులో అభిమానంతో ఎర్రబడిన సుశీల ముఖాన్ని, ఆవేశంలో యుక్తాయుక్త జ్ఞానాన్ని మరిచిపోయిన రాజు గమనించలేదుగానీ, నవమి చంద్రుడుమటుకు తన మృదు మధుర శీతల కరస్పర్శతో సానుభూతినంతా యిమిడ్చి ఓదార్చాడు.

"నీ ఆధిక్యమేమిటో తెలుసుకోవచ్చా!?" రోష కషాయిత నేత్రాలనెత్తి అంది సుశీల.

రాజు చిత్తరువే అయ్యాడు. ఏం చెప్పాలి? అసలిలాంటి ప్రశ్న వస్తుందని తెలిసిఉంటే ముందే జవాబు సిద్ధం చేసుకొని ఉండేవాడు. ఏది ఎలాగున్నా ప్రత్యక్షంగా కనిపిస్తున్నది తనచదువు ఒక్కటే.

"చదువు." కాసేపటికి తేరుకుని అన్నాడు.

"వెలకట్టు" అంది క్రింది పెదవి పంటితో నొక్కి...

"ఇప్పుడు దానితో పనేమిటి ?" వెలవెలబోతూ అన్నాడు.

"మనిద్దరి విలువలూ తెలుసుకుందామని!"

"ఓ!" తల తిరిగిపోయింది రాజుకు.

"నువ్వు డాక్టరువైతే దాదాపు ఇరవై వేల వరకూ ఇవ్వవచ్చు. అసలు మెడిసిన్‌లో చేరావని తెలిసినా ఇస్తారనుకో!" పేలవంగా నవ్వి అంది.

"సుశీ!" ఇక తట్టుకోలేకపోయాడు.

"ఆవేశపడకు. ఇక నాకున్న విలువెంతో చెప్పనా?"

ఆశ్చర్యపోయి చూశాడు సుశీల ముఖంలోకి.

'నా అందాన్ని మార్కెట్‌లో పెట్టి ధరకట్టితే ఇరవై వేలు చెయ్యకపోతుందా ? అందాన్ని ఆశించేవాడు..."

"ఛీ! సిగ్గులేకపోతే సరి!" ఆ మాటతోపాటు సుశీల చెంప ఛెళ్ళుమంది.

అదే క్షణంలో పెరటి తలుపు దగ్గరికి వచ్చిన పార్వతి జరిగిన సంఘటన చూసి నమ్మలేక కళ్ళు నులుపుకొని మరొకసారి చూసింది.

"రాజూ!"

తలెత్తి సుశీల ముఖంలోకిగానీ, పార్వతి ముఖంలోకిగానీ చూసే ధైర్యంలేక పరుగెత్తుతున్నట్లే వెళ్ళి మంచంమీద వాలిపోయాడు.

ఆ క్షణంలో సర్వమూ శూన్యంగా కనిపించింది. నెమ్మదిగా ఆవేశం తగ్గి, ఆ స్థానాన్నే ఆలోచన ఆక్రమించింది.

ఏమిటి తను చేసిన పని? ఎందుకింత పశుత్వం తనలో ప్రవేశించింది? వదిన ఏమనుకో నుంటుంది? సుశీల— అతిసున్నితం ఆ హృదయం — ఎంతగా గాయపడిందో! అసలు సుశీల ఏమంది? తన అందంతో భర్తను కొను క్కుంటూ...... ఛీ ఛీ! నోరెలా వచ్చింది ఆమాట అనేం దుకు? ఉహుఁ. అయినా ఆమాటలో తప్పేముంది? తన కెందుకంత ఆవేశం రావాలి? సుశీల అన్న మాటలో సత్యం లేదా? ప్రపంచమంతా ఎలా ఉంది? ఎవరికున్న ప్రత్యేకతకు వాళ్ళు విలువ కట్టుకుని ప్రపంచంలో బ్రతకా లనుకుంటున్నారు. లేదా రాణించాలని చూస్తున్నారు. అవును. అంతేమరి. తనకు చదువుంది. ఆ చదువుకు సుశీల అందం సరిపోతుంది. లేదా అన్నయ్య ఇంకో అమ్మాయిని చూస్తాడు. అందం లేకుంటే-తన చదువుకు సరిపోయేటంతటి డబ్బు ఆ అమ్మాయి దగ్గరుండాలి. అలా మార్చుకుంటారు తమ ప్రత్యేకతకున్న విలువలను

మానవుడేనా ఇలా ప్రవర్తిస్తున్నది! విద్యావంతుడు వివేకవంతుడు? ఇంత సంకుచితంగా? పోనీ ఈ వివాహ వ్యవ స్థను తీసేస్తే ఏం? అప్పుడన్నా ఈ కట్నాల గొడవ తప్పి పోతుందేమో? అయినా ప్రభుత్వం కట్నం తీసుకోరాదని శాసించిందిగా? ఎంతమంది తీసుకోకుండా ఉంటున్నారు? అయినా ఈ ఆలోచనలన్నీ ఇప్పుడు తనకెందుకు? తనిప్పుడు పెళ్ళిచేసుకోబోవడంలేదు. సుశీ! ఎంత కఠినంగా తయా రయ్యావు! నన్నెంత క్రూరునిగా మార్చావు! తనింతగా

ప్రేమించే సుశీలనేనా ఇంత క్రూరంగా హింసించింది! భగవాన్! నన్ను క్షమించు. సుశీ! నన్ను క్షమించలేవా?

రాజు కళ్ళల్లోనుండి నీళ్ళు రాలి చెంపలమీదుగా ప్రవహించాయి. బలవంతంగా కళ్ళు మూసుకున్నాడు. అయినా ఆలోచనలు వదిలి పెట్టనేలేదు. పొద్దుటే అన్నయ్యతో పెళ్ళిచూపులకు వెళ్ళాలి గాబోలు! హుఁ...

"ఏమిటి నీ అభిప్రాయం?" తమ్ముని ముఖంలోకి చూసి అడిగాడు సాంబశివం.

రాజు మాట్లాడలేదు. ఏం చెప్పడమా అని ఆలోచిస్తున్నాడు. అమ్మాయి బాగా లేదని చెప్పడానికి లేదు. ఎందుకంటే అమ్మాయి సలక్షణంగా ఉంది. బాగున్నమ్మాయిని బాగులేదనడం అన్యాయం. చదువు లేదని చెప్పడానికి లేదు, అమ్మాయి పి. యు. సి. చదువుతూంది కాబట్టి. ఇంకేం చెప్పాలి?

"మరిదిగారికింత ఆలోచ నెందుకో?" భారతి అదో రకంగా నవ్వి అంది.

చురుక్కున చూశాడు భారతి ముఖంలోకి.

"మాట్లాడ వేంరా?"

"ఏముంది?" నసిగాడు.

"చెప్పు." అనునయంగా అన్నాడు.

"ఇష్టంలేదు." తల మరోవైపుకు తిప్పి అన్నాడు.

"ఏం?"

"కారణం అడక్కు."

"సాంబశివం గోడనానుకుని నిల్చొనున్న పార్వతి

కళ్ళల్లోకి చూశాడు. పార్వతి ఏం చెప్పిందో సాంబశివంకే తెలియాలి. అక్కణ్ణుండి లేచి వరండాలోకి వెళ్ళాడు.

"ఏం, రాజూ?" పార్వతి ప్రశ్న.

"వదినా! మీరంతా కలిసి నన్నెందుకిలా చిత్రహింస చేస్తున్నారో అర్థం కావడంలేదు." బాధతో కుమిలిపోయాడు.

పార్వతి అక్కణ్నుండి వెళ్ళిపోయింది. భారతి మౌనంగా గోడకానుకుని నిల్చుండిపోయింది.

"భారతీ! మీ అక్కయ్యనిలా పిలు" అంటూ పోస్టుమన్ ఇచ్చి వెళ్ళిన కార్డు చదవడంలో మునిగి పోయాడు సాంబశివం.

భారతి వెళ్ళి పార్వతిని పిలుచుకు వచ్చింది.

"వాళ్ళు ఉత్తరం వ్రాశారు."

"ఎవరు?"

"మొన్న చూసొచ్చిన అమ్మాయి తండ్రి."

"ఏమట?"

"ఆ అమ్మాయికి మనవాడు నచ్చలేదట!"

తోడికోడళ్ళిద్దరూ హాయిగా శ్వాస తీసుకున్నారు. రాజు ముఖం కాస్త తేటపడింది, అప్పటికి సమస్య తీరినట్లు.

"నీ ఇష్టప్రకారమే జరిగిందిలే" ముఖం చిట్లించి తమ్ముని ముఖంలోకి చూసి అన్నాడు సాంబశివం.

రాజు తల తిప్పి మెల్లగా నవ్వుకున్నాడు.

"మన శాస్త్రిలు ఇంకో సంబంధం విషయం ఉద

యః మే చెప్పాడు." పార్వతి ముఖంలోకి అర్థవంతంగా చూస్తూ అన్నాడు సాంబశివం.

"ఇంకే సంబంధాలూ చూడవద్దు." ముఖం చిట్లించి అన్నాడు రాజు.

"చూడక?"

"ఇప్పుడు నా పెళ్ళికి వచ్చిన తొందరేం లేదు. మొన్నైనా ఎందుకు వచ్చానంటే నువ్వు ముందే వస్తానని మాటయిచ్చావనీ, వెళ్ళి చూసి వచ్చినందువల్ల కలిగే నష్టమేమీ లేదనీ......"

"మన పరిస్థితులు..."

"బాగా లేవు."

"మరి చదువెలా సాగుతుంది?"

"సాగదు. ఫర్వాలేదు."

సాంబశివం అదిరిపడ్డాడు. తమ్ముని ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"ఏమిటి నువ్వంటున్నది?"

"ఇక చదవదలుచుకోలేదు."

సాంబశివం కాళ్ళక్రింద భూమి కదులుతున్నట్లనిపించింది. తమ్మునిమీద పెట్టుకున్న ఆశలూ, వాని భవిష్యత్తును గురించి కన్నకలలూ పునాదులతోసహా కళ్ళ ముందే కూలిపోతున్నట్టనిపించింది.

"నీకేం మతి పోయిందా!" చివరకు తేరుకుని అడిగాడు సాంబశివం.

"మతి ఉండబట్టే వెళ్ళనంటున్నాను. లేకుంటే వెళ్ళేవాడిని" అన్నాడు ముఖం చిట్లించి.

నిరాశా నిస్పృహలతో పాటు అంతులేని కోపమూ వచ్చింది సాంబశివానికి.

"అంతా నీ ఇష్టమేనా?" అన్నాడు కొరకొరా తమ్ముని ముఖంలోకి చూస్తూ.

రాజు మాట్లాడకుండా మౌనంగా కూర్చున్నాడు.

"నీమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నామో, నువ్వు డాక్టరువైతే చూడాలని ఎన్ని కళ్ళతో ఎదురు చూస్తున్నామో నీకు తెలిస్తే బహుశా ఇట్లా మాట్లాడక పోదువు." బరువుగా అన్నాడు.

"ఆశలు పెట్టుకోవడం సహజమే, అన్నయ్యా! ఆశ లేకుంటే మానవుడు జీవించలేడు. కానీ ఆ ఆశలకూ ఓ హద్దంటూ ఉండాలి. అలాలేని రోజు మనకు మిగిలేది కేవలం నిరాశే అవుతుంది."

"నిన్ను డాక్టర్ను చెయ్యాలనుకోవడం అంతంలేని ఆశా!" ఆశ్చర్యపోయాడు సాంబశివం.

"మన పరిస్థితుల దృష్ట్యా చూస్తే." సాంబశివం కళ్ళల్లోకి చూసి అన్నాడు రాజు.

తోడికోడళ్ళిద్దరూ నిశ్శబ్దంగా అన్నదమ్ముల మధ్య జరుగుతున్న వాగ్వివాదాన్ని వింటున్నారు.

"పార్వతీ, వింటున్నావా నీ ముద్దుల మరిది మాటలు?" తమ్ముణ్ణి ఏమనలేక పార్వతిమీద విరుచుకు పడ్డాడు సాంబశివం.

పార్వతికి నవ్వొచ్చింది. అయినా ఆపుకుని "మీ అన్నయ్య మనసును కష్టపెట్టడం ఏం బాగాలేదయ్యా, రాజూ!" అంది.

"అందుకు క్షమించమని అన్నయ్యను ప్రార్థిస్తున్నాను."

"చేసే పని చల్లగా చేసి పైగా క్షమాపణ! అదొకటి బాగా నేర్చుకున్నావు! అయినా నీకిన్ని మాటలెందుకు? శాస్త్రిగారు చెప్పిన సంబంధం కుదిరినట్టయితే వాళ్ళే ఈ అయిదు సంవత్సరాల కయ్యే ఖర్చూ పెట్టుకుని తర్వాత ప్రాక్టీసు పెట్టుకునేందుకు కావలసిన డబ్బూ ఇస్తారట. అప్పుడు ఎవ్వరికీ కష్టం ఉండదు. ఏమంటావురా?" ఆశ కొట్లాడుతుండగా అడిగాడు సాంబశివం.

"క్షమించన్నయ్యా! నాకూ ఆశా, ఆశయాలూ ఉన్నాయి. నా జీవితం నాకోసంగాక, నా వాళ్ళ సుఖ సంతోషాలకోసం వినియోగించా లనుకోవడం — అది స్వార్థమో నిస్వార్థమో నాకే తెలీదు. బ్రతికినంతకాలం మానవత్వపు పొలిమేరలను దాటకూడదని ఒక నిర్ణయం. జీవితంలో శాశ్వతంగా నిలిచిపోయి, అన్నింటికన్నా ఎక్కువ ఆనందాన్నివ్వగలిగిన ప్రేమను డబ్బుతో కొనుక్కోలేనని ఒక సిద్ధాంతం. మానవత్వాన్ని దూరంచేసే చదువులో గొప్పతనం లేదనీ, కేవలం ఒక డిగ్రీ తీసుకోవడమే జీవితలక్ష్యం కాదనీ ఆలస్యంగా తెలుసుకున్న సత్యం. వీటి నన్నింటినీ బలిచేసి ఒక డిగ్రీ తీసుకోవడం నాకు

బొత్తిగా ఇష్టంలేదు.” నెమ్మదిగా, స్పష్టంగా, అందరి ముఖాల్లోకీ తరిచి తరిచి చూస్తూ అన్నాడు.

అందరూ తెల్లబోయి చూడటం తప్ప మరేం అనలేకపోయారు.

“వదినా! ఎందుకలా ఆశ్చర్యపోతారు? చెప్పరాని మాటలు నేనేం చెప్పాననిః” బాధాతప్తకంఠంతో అన్నాడు.

“అయితే కట్నం తీసుకుని చదవడం ఇష్టంలేదూ?” తమ్ముడు మాట్లాడిన మాటల్లోని అర్థాన్ని తనకు తెలిసిన విధంగా వ్యాఖ్యానించుకుని ప్రశ్నరూపకంగా బయట పెట్టాడు సాంబశివం.

“అవును.”

సాంబశివం కొన్నిక్షణాలు ఆలోచిస్తూ ఉండి పోయాడు.

“పోనీ నాకష్టాలేవో నేనే పడతాను. రేపు బయల్దేరి వెళ్ళు” అన్నాడు.

“ఉహుఁ... వెళ్ళదలచుకోలేదు. వెళ్ళను కూడా.”

తన ఆఖరు ప్రయత్నంకూడా అలా విఫలమైనందుకు సాంబశివం హృదయం బాధతో సిగిపోయింది.

“వెళ్ళక?”

“ఇంట్లో ఉండిపోతాను.”

“ఏం చేద్దామని?”

“మాస్టరీ.”

సాంబశివం కుప్పగా కూలిపోయాడు, తను కట్టుకున్న

ఆశా సౌధాలు కూలినట్లు. స్టెతస్కోపు మెడలో వేసుకుని తమ్ముడు వెళ్ళుతుంటే తను వాడి పక్కనే నాలు గడుగులు నడిచినా చాలదూ? ఫలాని సాంబశివం తమ్ముడు డాక్టరంటే ఆ ఒక్కమాట చాలదూ? తమ్ముడు పట్నం నుండి కారు వేసుకునివచ్చి ఇంటిముందు ఒక్కక్షణం ఆగితే చాలదూ? ఏమిటి వా డంటున్నది? మాస్టరవుతాననా? మాస్టరు కావడమూ ఓ గొప్పే! ఈ ఊర్లో ఎంతమంది మాస్టర్లు లేరు? తన తమ్ముడు—ఇంత తెలివిగలవాడు, చివరకో మాస్టరేనా కావడం? వాణ్ణి డాక్టరు చెయ్యాలని తను చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థం కానలసిందేనా? ఒక వేళ సుశీల తనను చేసుకోనందని చదువుమీద విరక్తి కలిగిందా? ఏమో, ఈకాలం పిల్లలు... చెప్పేందుకు లేదు.

"అయితే సుశీల చేసుకోనందని చదువు మాను కుంటున్నావా?" అన్నాడు ఆలోచనలనుండి తేరుకొని, రాజు హృదయంలోని మాట ఖచ్చితంగా అదేనన్నట్లు.

"దానికీ, దీనికీ సంబంధం లేదన్నయ్యా!"

"అయితే చదువు మానుకోవడ మెందుకు?"

"ఉన్న డబ్బంతా నా చదువుకు పెట్టి మీరంతా తిండి కూడా లేక బాధపడడం నాకిష్టంలేదు."

"మరి కష్టపడకుంటే చదువు లెలావస్తాయి?"

"కష్టపడేందుకు ఓ హద్దుంది. ఆ హద్దులు దాటి పోతే మనిషి మానవత్వానికి దూరంకావచ్చు. నా చదువు కోసం వదినలూ, పిల్లలూ, మీరూ ఇంతమంది—కనీసం

మనిషికి కావలసిన అవసరాలకుకూడా ఎందుకు దూరం కావాలి? నేను డాక్టర్నయి తిరిగి వచ్చేసరికి మీరంతా నాకు పేషెంట్లవుతారేమో! అదీ సందేహమే! అన్నయ్యా! నన్ను డాక్టర్ను చెయ్యాలని ఎంతమందిని కష్టపెడు తున్నావో ఒక్కసారి ఆలోచించు."

"కష్టపడందే ఎవ్వరూ అభివృద్ధికి రారు." కఠినంగా అన్నాడు.

"అవును. కష్టపడాలి. ఒకరిని కష్టపెట్టరాదు. తను కష్టపడి అభివృద్ధిలోకి రావాలి. స్వశక్తిమీద నాకు నమ్మక ముంది. వేలకు వేలు కుమ్మరించి సంపాదించవలసిన డిగ్రీ డాక్టరీ. అది మన అందుబాటులో లేదు. డబ్బున్నవాళ్ళు ఆ డిగ్రీ తీసుకోగలరు. మనలాంటి వాళ్ళం దూరంగానే ఉండాము."

"డాక్టరయితే నువ్వనే మానవసేవకు ఎక్కువ అవ కాశముంటుంది." తమ్ముడి ఆదర్శాన్ని ఎరగా చూపాడు— అదే చివరి ఆశగా.

రాజు నవ్వకుండా ఉండలేకపోయాడు. "మానవసేవ చెయ్యాలంటే డాక్టరే కానవసరం లేదన్నయ్యా! మాస్టరు నయినా చెయ్యవచ్చు. పొలం దున్నుతూ నువ్వూ చెయ్య వచ్చు. వంటచేస్తూ వదినా చెయ్యవచ్చు. అయితే డాక్ట ర్లంతా మానవసేవ తమ జీవితలక్ష్యంగా కలిగి ఉన్నారనా, నీ ఉద్దేశం?"

"రామ్మూర్తి మాస్టరే...నువ్వూ..."

"అయితే వచ్చిన నష్టమేమిటన్నయ్యా!"

"డాక్టరుకున్న గౌరవం మాస్టరుకుండా? డాక్టరు డాక్టరే! మాస్టరు మాస్టరే!"

"అవును మరి! అన్ని వేలుపోసి కొనుక్కున్న డాక్టర్ డిగ్రీ ఆమాత్రం గౌరవం చూపకుంటే ఏం న్యాయం?" నవ్వుతూ అన్నాడు రాజు.

"స్టెతస్కోపు మెడలో వేసుకొని పోతుంటే ఎంత దర్జా! నువ్వేమన్నా చెప్పు. ఆ దర్జా ఇక రాదు."

రాజు పెద్దగా నవ్వాడు—అదన్నమాట అన్నయ్య మనసులో మాట! ప్చ్! అదొక సరదా.

"మాస్టరంటే ఎందుకంత తక్కువో నా కర్థంకాదు. డాక్టరువలె స్టెతస్కోపు లేకపోవచ్చు. లాయరువలె నల్లకోటు లేకపోవచ్చు. ఇంజనీరు..."

"ఆ మాటలన్నీ చాలించు. నువ్వు చదువు పూర్తి చేసి తీరాల్సిందే." చివరి సాధనం ఉపయోగించాడు.

"క్షమించన్నయ్యా!" అక్కణ్ణుంచి లేచి వరండాలోకి వస్తూ అన్నాడు రాజు.

"ఆఖరిసారిగా అడుగుతున్నాను."

"వెళ్ళను."

సాంబశివం కోపంగా వెళ్ళిపోయాడు వీధిలోకి. రాజు అలాగే వరండాలో నిల్చుని శూన్యంలోకి నిశ్చలంగా చూడ సాగాడు. ఆలోచనలుమటుకు నీతో మాకేంపని అన్నట్టు సాగిపోతూనే ఉన్నాయి. అన్నయ్య కెందు కర్థంకాదు? ఇంత మందిని ఇంతగా కష్టపెట్టి తన్ను డాక్టరీ చదివించకుంటేనేం! వదిన కట్టుకున్న చీర ఎంత జీర్ణావస్థలో ఉంది! ఆ విషయం

అన్నయ్య ఏ రోజన్నా గమనించాడా? వదిన ఎంతగా చిక్కిపోయింది! ఆ విషయం ఏ రోజన్నా పరిశీలించాడా? పిల్లలవైపు పరికించి ఒక్కసారన్నా చూశాడా? వాళ్ళసలు తింటున్నారో, పస్తుంటున్నారో కనుక్కున్నాడా? అందరూ తనకోసం త్యాగం చెయ్యను సిద్ధంగా ఉన్నారని తనకు తెలుసు. పెద్దవాళ్ళ సంగతి వదిలేసినా, పిల్లల సంగతి? ఘడియకో కోరికా, రోజుకో ఆశా చిగురిస్తున్న వాళ్ళ లేత గుండెల్లో కఠిన దారిద్ర్యపు కారుచిచ్చు నెలా రగిలించ గలడు? అందుకు అన్నయ్య సమ్మతించినా తనెలా చూస్తూ ఊరుకోగలడు? అసలు తను డాక్టరయ్యేవరకన్నా వీళ్ళంతా ప్రాణాలతో ఉంటారా? అన్నయ్య ఎందుకీ విషయాలన్నీ ఆలోచించడు? పెద్దవదిన ఆరోగ్యం! ఇంకా ఉపేక్షచేస్తే తమకు దక్కుతుందా? భగవాన్! తనకీ చదువు వద్దు. దాని కోసం ఇంతమంది సుఖాన్ని, ప్రాణాలను బలితీసుకోలేడు. వచ్చే సంవత్సరం టీచర్ ట్రెయినింగుకు వెళ్ళతాడు. అన్నయ్యకు కోపంవస్తే వచ్చిందిగాక! అన్నయ్యకు మాస్టరంటే ఎందుకో అంత చికాకు? అంత చిన్నచూపు?

పార్వతి భోజనానికి పిలవడంచేత రాజు ఆలోచనలకు అంతరాయం కలిగింది.

"వదినా! ఒంట్లో బాగుండడం లేదని అన్నయ్యకు చెప్పలేదా?" విస్తరి ముందు కూర్చుని అడిగాడు.

"ఎలా చెప్పను? నోరురాదు, రాజూ!"

రాజు బరువుగా నిశ్వసించాడు.

చలపతిదగ్గర డబ్బు తీసుకొని, ఆ మర్నాడు ఉద

యనే పార్వతిని డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళాడు. ఆ రోజు పార్వతిని పరీక్షగా చూసిన సాంబశివం తన అజ్ఞానానికి నొచ్చుకున్నాడు. తనకు జ్ఞాననేత్రమై జీవితపు విలువలను తెలుసుకునేందుకు తోడ్పడిన తమ్మునికి మనసులోనే వందనాలర్పించాడు.

సాయంత్రం పార్వతీ, రాజులకోసం ఇంటిల్లిపాదీ ఎదురుచూడసాగారు. రాజును వాకిట్లో చూడగానే "ఏమంటు?" అన్నాడు సాంబశివం ఆత్రంగా.

"సరైన ఆహారంలేక బలహీనమట. విటమిన్ల లోపం." అన్న ముఖంలోకి ఓరగా చూస్తూ అన్నాడు.

"అసలు తిండి తింటూందో లేదో!" తనలో తనే అస్పష్టంగా గొణుక్కున్నాడు సాంబశివం.

రాజు పెరట్లోకి వెళ్ళి ముఖం కడుక్కునివస్తూ జాజి పందిరివేపు చూశాడు. శశి నిచ్చెనఎక్కి మొగ్గలు తుంపుతున్నది. సుశీల దండ కట్టను సిద్ధంగా కూర్చొనుంది.

సుశీల ముఖంలోకి పరిశీలనగా చూస్తూ, "శశీ! కాసిని మంచినీళ్ళు తీసుకురా!" అన్నాడు రాజు.

రాజు తెచ్చిన పరికిణీ గుడ్డలు చూసి చిన్నాన్న మంచితనానికి మురిసిపోతున్న శశి, రాజు నోట్లోనుంచి మాట రాగానే నిచ్చెనదిగి పరిగెత్తిపోయింది.

"నన్ను క్షమించు, సుశీ!" అన్నాడు సుశీల ముఖం లోకి చూస్తూ.

"ఎందుకూ?" తలెత్తకుండానే అంది.

"ఆ రోజు ఆవేశంలో చెయ్యి చేసుకున్నాను."

"ఫర్వాలేదు." ముభావంగానే జవాబిచ్చింది.

"వదిన నాకంతా చెప్పింది."

సుశీల తలెత్తి చురుక్కున చూసింది. రాజు కళ్ళు ఆప్యాయతనంతా కుమ్మరిస్తున్నాయి.

"ఇక నన్ను మోసం చెయ్యలేవు సుమా!" అన్నాడు మృదువుగా నవ్వి.

"మోసమా?"

"అవును. నిన్ను నువ్వు మోసపుచ్చుకుని, నన్ను మోసపుచ్చడం."

"నేనెవర్నీ మోసగించలేదు." కళ్ళు దించుకుని అంది.

"అయితే ఆ మాటే నీ మనసు నడుగు. ఏం చెబుతుందో!"

సుశీల జవాబు చెప్పలేదు.

"అన్నయ్యలాగ నీకూ నన్ను డాక్టర్ని చెయ్యాలని పించిందన్నమాట. పాపం ఏం ప్రయోజనం? ఆ అమ్మాయి నేను బాగాలేనని చేసుకోనంది! నేను నీకుతప్ప మరే అమ్మాయికళ్ళకూ బాగుండను!" కొంటెగా సుశీల ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"అమ్మాయి చేసుకోనందో, అబ్బాయి చేసుకోనన్నాడో నాకు బాగా తెలుసు!" చురచురా రాజు ముఖంలోకి చూస్తూ అంది.

"ఎంత ఒకవేళ అన్నయ్య బలవంతం చేస్తే మటుకు......నాకు దూరమై ఎలా బ్రతకాలనుకున్నావు, సుశీ?" తప్తకంఠంతో అన్నాడు.

అప్పటికే అశ్రుత ప్తమైన సుశీల కళ్ళల్లోనుంచి నీళ్ళు చెంపలమీదుగా జారాయి.

మంచినీళ్ళ గ్లాసుతో వచ్చిన శశి, "పిన్ని ఏడుస్తుందేం, చిన్నాన్నా!" అంది సుశీలవైపు ఆశ్చర్యంగా చూస్తూ.

"ఎందుకంటే......చెప్పనా, సుశీ?" అన్నాడు మంచినీళ్ళు తాగి గ్లాసు క్రిందపెట్టి.

"ఏముంది చెప్పను?" కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది.

"ఉందో లేదో చెప్పనా?"

"చెప్పుకో."

"ఎందుకంటే మీ పిన్ని మెడలో నేను పూలమాల వెయ్యాలట!" ఓరగా సుశీలవైపు చూస్తూ అన్నాడు.

శశి ఫక్కున నవ్వింది—నిచ్చెనెక్కుతూ.

'శశీ! నువ్వు మొగ్గలన్నీ కోసి నాదగ్గరివ్వు. నేను దండకట్టి మీ పిన్ని మెడలో వేస్తాను."

శశి మొగ్గలుకోసి క్రిందవేస్తూ అర్థవంతంగా నవ్వింది రాజు ముఖంలోకి చూసి. రాజు మొగ్గలు ఏరుతూ సుతారంగా నవ్వాడు సుశీల ముఖంలోకి చూసి. సుశి కళ్ళుదించి మధురంగా, మెత్తగా, నాజూగ్గా నవ్వింది కడుతూన్న జాజి మాలవైపు చూసి.

జాజిమొగ్గలు ఏరడం మాని, సుశీల నవ్వగా రాలిన మల్లెలనూ, మొల్లలనూ, గులాబులనూ ఏరసాగాడు రాజు!

—"ఆంధ్రప్రభ" వారపత్రికనుండి.

# మనిషి - దేవుడు

[కట్టేది ఖద్దరైతేనేం! డబ్బుకోసం ఎంతటి ఘోరానికైనా వెనుదీయని పాషండుడు రాఘవయ్య; చదువు, తెలివితేటలు, అందం, ధనం ఎన్ని ఉంటేనేం! నీతి, నిగ్రహము, దూరాలోచన అన్నీ కొరవడిన సరోజిని; ఇంజనీరింగ్ చదివినా వ్యక్తిత్వం అనేది లేని ఒక విచిత్రజీవం మహేశ్;

అంతా పథభ్రష్ట మానవాళికి ప్రతీకాలు; వీరిమధ్య జరిగేకథ దైవానికి, ధర్మానికి, దూరమైన పతిత మానవ చరిత్రనుండి విరిగిపడ్డ ఒక వికృతఖండం.]

మహేశ్ కిటికీ అద్దాల్లోనుండి బయటికోమారు చూశాడు. సన్నని వానజల్లు కిటికీ అద్దంమీదపడి ముత్యాలు చల్లినట్లున్నాయి. పశ్చిమ కొండల్లోని సూర్యుడు నీలి మేఘాలతెరలను తొలగించుకొని ఎఱ్ఱని వెలుగును సమస్త జీవరాసిమీదా ప్రసరింపజేశాడు. బరువుగా నిట్టూర్చి, దూరంగావున్న రావిచెట్టువైపు చూశాడు. వానజల్లుకూ, అరుణకాంతులకూ మురిసిపోయి తళతళ మెరుస్తుంది రావి చెట్టు.

ఉయ్యాల్లోని పసిపాప కెవ్వుమంది. మంచంమీద కూర్చుని పాపవైపు నిశ్చలంగా చూస్తున్న సరోజిని ఉయ్యాల్లోని పాపను తీసుకుని హృదయానికి హత్తుకుని పాలు పట్టసాగింది. పాప ఏడ్పుతో బాహ్యప్రపంచంలో కొచ్చిపడ్డ

మహేశ్ చలిగా వుందని గ్రహించాడు! కుర్చీమీద మోకాళ్ళమీద కూర్చుని, మోకాళ్ళచుట్టూ చేతులుచుట్టి మోకాళ్ళమీద గడ్డం ఆన్చి, సరోజినివేపు చూశాడు. తల మీదనుండి చెవులమీదుగా మెడచుట్టూ మఫ్లరు వేసుకుంటూంది. పసిపిల్లవాడొచ్చి, రొట్టె, పాలూ లాకర్ మీద కాసేపు అలాగే నిల్చున్నాడు.

"రేపు వూరికెళ్ళటానికి తయారుగా వుండమన్నారు బాబుగారు." గదిలోని భయంకర నిశ్శబ్దాన్ని సాధ్యమైనంత వరకూ పారతోలుతూ అన్నాడు.

సరోజిని పసిపిల్లవాని ముఖంలోకి చూసి, పాప ముఖంలోకి చూసింది; మహేశ్ సరోజిని ముఖంలోకి చూసి పశ్చిమదిక్కువైపు చూశాడు. సంధ్యా, భాస్కరుల సరస సల్లాపాలను లోకంకంట పడనీయకుండా మబ్బుతెరల పరదా వేసింది ఆకాశకాంత. దినకరుణ్ణి వశంచేసుకోలేక వివశురాలై పీగిపోతున్న నిశాకన్నె భగ్నహృదయంలోని కాటుచీకట్లు భూమిమీద కొద్దికొద్దిగా పడ్తున్నాయి.

వర్షం జోరు హెచ్చింది చలి మరీ ఎక్కువైంది. మహేశ్ మరి కాస్త ముడుచుకకూర్చుని అలాగే పశ్చిమ దిక్కువైపు చూడసాగాడు.

"మరోగంటవెళ్ళాక వస్తానని చెప్పమన్నారు బాబు గారు" అని సరోజినివైపు, మహేశ్‌వైపు చూసి, జవాబు రాక - గోనెసంచి తలమీద కప్పుకుని వర్షంలోకి వెళ్ళిపోయాడు, పనికుఱ్ఱాడు.

సరోజిని బరువుగా నిట్టూర్చింది. మహేశ్ అదిరి పడి సరోజినివైపు చూశాడు. ఒడిలో నిద్రపోతున్న పాపను మెల్లగా ఎత్తి ఉయ్యాల్లో పడుకోబెట్టింది.

"సరోజా !"

"ఊ..."

"విన్నావుగా ?...మరోగంటకల్లా నాన్నొస్తారట."

సరోజిని ఏం మాట్లాళ్ళేదు.

గదిలోపల చీకటి - నిశ్శబ్దం-గదివెలుపలా చీకటి- వర్షం-మరీ భయంకరంగా వున్నాయి. సరోజిని లేచి లైటు స్విచ్ ఆన్‌చేసింది. గదిలోని చీకటి భయంగా పారిపోయి బైట చీకటిలో కలిసిపోయింది. నర్సు లోపలికొచ్చి టెంప రేచర్ నోట్‌చేసి వెళ్ళింది.

ఆలోచనచే మహేశ్ ముఖంలో ఏర్పడిన భ్రూముడి సరోజినికి అంతులేని ఆశ్చర్యాన్ని, కుతూహలాన్ని కలిగిం చాయి.

"ఏమిటి అంతగా ఆలోచిస్తున్నారు ? నన్ను గురిం చేనా ?" సరోజిని ప్రశ్నించింది.

"ఊహు..." మహేశ్ తల అడ్డంగా తిప్పాడు.

"మరి ?"

"నన్నుగురించే !"

"ఆలోచించడమంటే ఏమిటో యితనికి తెలుసా ?" అని ఆశ్చర్యంతో మూగపోయింది సరోజిని హృదయం.

"ఏమిటో ?" ఆ ఆలోచనేమిటో తెలుసుకుందా మని ప్రశ్నించింది.

"ఒక్క విషయం అడుగుతాను. నిజం చెప్తావుగదూ!" సరోజిని కళ్ళల్లోకి చూసి జాలిగా అడిగాడు.

బాధగా నవ్వి, అంగీకార సూచనగా తలూపింది సరోజ.

"నాన్న కీవిషయం ముందే తెలుసా!"

సరోజిని ఆశ్చర్యంగా చూసింది మహేశ్ ముఖం లోకి. అతని ముఖంలోని అమాయకత్వం సరోజిని హృదయాన్ని వ్రయ్యలు చేసింది. అమాయకతను భరించలేక రెండుచేతుల్లో ముఖాన్ని దాచుకుంది.

"తెలుసా? సరోజా?"

"ఊఁ..." చేతుల్లోనుండి తలెత్తకుండానే బాధగా మూల్గింది.

మహేశ్ మరేం మాట్లాళ్ళేదు. చలనంలేకుండా కుర్చీలో అతుక్కుపోయాడు. వ్రేళ్ళసందుల్లోనుండి మహేశ్ వైపు చూసింది సరోజిని. అమాయకత్వం తప్ప మరే ఇతర భావాలను చిదపలేకపోయింది. మహేశ్ లాంటి అమాయకు లుంటారంటే యిచివరకు ఓ చిరునవ్వుతో కొట్టిపారేసి వుండేది. కానీ యిప్పుడు ప్రత్యక్షంగా చూస్తుంది, ఎలా కొట్టేయగలదు? కానీ యింతటి అమాయకుడు తనభర్త కావడం.....

సరోజని మనస్సు భీభత్సంగా తయారయింది. మెదడు ఆలోచనలతో గిజిగాని గూడులా వుంది. కూర్చో లేక ప్రక్కమీద వాలిపోయింది. గదిలోని భయంకరమైన నిశ్శబ్దం, భయంకరమైన ఆలోచనలను రేకెత్తిస్తుంది. తన

జీవితం...ఓ లక్షాధికారి ఏకైక తనూజ జీవితం...యింత కఠోరంగా భయంకరంగా తయారవుతుందని తను అసలు ఏరోజైనా అనుకుందా ?

ఆడుతూ, పాడుతూ సినిమాలా గడిచిపోతుందను కున్న తన జీవితంలో యీ ముళ్ళపొదలేవిఁటి?

వసంతంలోని మంజుల కోయిలగానమనుకున్న తన జీవితంలో యీ అపశ్రుతు లేమిటి ?

కానీ, యిది తన స్వయంకృతాపరాధనే ! చేజే తులా తన సర్వనాశనాన్ని తనే కొని తెచ్చుకుంది.

యవ్వనోద్రేకంలో తప్పటడుగు వేసింది. నైతిక సూత్రాలపట్ల గౌరవం లేకపోలేదు. సంఘం కట్టుబాట్లను అర్థం చేసుకోలేనంతటి తెలివితేటలు లేక కాదు.

స్త్రీ కాలుజారితే ప్రకృతి విధించే శిక్షేమిటో తెలుసుకోలేనంతటి జ్ఞానం లేకనూ కాదు.

తన అతీతమైన తెలివితేటలకూ, సునిశితమైన విమర్శనకూ - ఒకోసారి లెక్చరర్లే ఆశ్చర్యపడేవాళ్ళు.

తను ఆగర్భ శ్రీమంతురాలైనందుకూ, — అద్భుత మైన తెలివితేటలు కలిగివున్నందుకూ స్నేహితులు అసూయపడేవాళ్ళు.

'పూర్వజన్మలో బహుశా ఎన్ని నోములు నోచావో... లేకుంటే యింత తెలివితేటలూ, డబ్బూ, హోదా, అందం ఒక్కరికే ఎలా వస్తాయి' అంటూ కుళ్ళి కుళ్ళి ఏడ్చేది జానకి. ఇహ...యిప్పుడు చూస్తే ఏమంటుందో...? హృదయం పగిలేలా నవ్వుతుంది గాబోలు !

ఎమ్. ఎ. కాగానే పి. హెచ్. డి. చెయ్యాలను తన ఆశలు ఫలించలేదు. తను కోరుకున్న కోరికలు ఫలించక పోవడమంటూ యింతవరకూ జరగలేదు కానీ యిప్పుడన్నీ అప్రశుతులే! అవును.....అన్నీ అప్రశుతులే.....

చెక్కిళ్ళమీదుగా జారిన వెచ్చని కన్నీళ్ళు దోసిట్లో రాలిపడుతున్నాయి. అరచేతుల్లోని కన్నీటిబొట్లను తాకిన పెదిమలు, ఉప్పదనాన్ని అసహ్యించుకొని బిగుసు కొన్నాయి. కఠోరసత్యాలతో కఠినమైన మనసు యిందుకు కించిత్తయినా చలించక ఆలోచనలతో ముందుకు సాగి పోతుంది.

తన ఆశలూ, కోరికలూ నేలకూలిపోడానికి కారణం తన పశుత్వమే! ముక్కూ మొగం తెలీని అనూప్‌కుమార్ తియ్యని మాటలను నమ్మి తాత్కాలికోద్రేకానికిలోనై... చేతులారా జీవితాన్ని నాశనం చేసుకుంది. ఆ సంఘటన జరిగిన కొద్దిరోజులకే తను మరోజీవిని భూమ్మీదకు తేబో తున్నట్లు తెలుసుకొంది. మరికొన్నాళ్ళకు యింట్లోకూడా తెలిసింది.

అన్నయ్యా, నాన్నా గౌరవానికి ఎక్కడ ముప్పు కలుగుతుందోనని తల్లడిల్లిపోయారు. అనూప్‌కుమార్‌ను పెండ్లి చేసుకోమని అన్నయ్య సలహా యిచ్చాడు. కానీ రెణ్ణెల్లక్రితమే రాజమండ్రికి ట్రాన్స్‌ఫరయ్యాడు. అనూప్ కుమార్ వివాహితుడు, ముగ్గురుబిడ్డల తండ్రి...అయినా అన్నయ్య ఉత్తరం వ్రాసి చూశాడు. ఊహు...లాభంలేక పోయింది. తెలివిగా తప్పించుకొన్నాడు. అమ్మా, నాన్నా

మరో సలహా యిచ్చారు...యీ చిట్టితల్లిని కడుపులోనే హత్యచెయ్యమని! అబ్బ! ఎంత భయంకరమైన సలహా! పాశవికవాంఛకు లోబడిచేసిన పొరపాటుకు యీ రోజుకూ యింతగా బాధపడ్తుంటే...అంతటి రాక్షసకృత్యాన్ని చేసి మనిషిగా—మనుష్యుల్లో తనెలా బ్రతగ్గలదు?

అన్నయ్యా, నాన్నా వెతికి వెతికి యింజనీరింగ్ కాలేజీనుండి మహేశ్‌ను పట్టి తెచ్చారు. ఆరోజు మొదటి సారిగా చూసింది మహేశ్‌ను.

ప్రపంచపు నీలినీడలు సోకని స్వచ్ఛమైన అమాయకతతో మలచిన మూర్తి! అతను...యీ రోజుకూ అలాగే వున్నాడు...

"సరోజా! చలి ఎక్కువగావుంది. తలుపులు వెయ్యనా?"

కన్నీటితో మలినమైన ముఖాన్నెత్తి మహేశ్‌వైపు చూసింది.

"చలిగా లేదూ?"

"ఊఁ...దోసిట్లో తిరిగి తలదాచుకుంటూ మూలిగింది.

మహేశ్ వెళ్ళి తలుపుతీసి తిరిగి కుర్చీలో ముడుచుక కూర్చున్నాడు.

"నాన్నొచ్చే వేళయింది" ప్రకాశంగా అన్నా స్వగతంలా వుంది. గొంతు కొద్దిగా కంపించింది.

సరోజ హృదయం సుళ్ళు తిరిగిపోయింది. ఇతను... తన భర్త...వ్యక్తిత్వమనేది లేకుండా...భగవాన్!...

ప్రపంచంలో ఇంత అన్యాయంగూడా వుంటుందా ? మామ గారి ఆత్మ ఏరోజో చనిపోయింది...

అందుకే ఒక్కగా నొక్కకొడుకు, ఆత్మను హత్య చేసేందుకు వెనుకాడలేదు. తనను కోడలుగా చేసుకొనేందుకు యాభై వేలూ, తన నైతికపతనానికి మరో పాతిక వేలూ తీసుకొని యీ అమాయకుడిచేత తన మెళ్ళో మూడుముళ్ళూ వేయించిన మామగారు మానవజాతిలో ఏ తరగతికి చెందుతారో తేల్చి శిక్షింపవలసిన బాధ్యత ఒక్క ఆ సర్వసాక్షిమీదే వుంది. తన పేరు ప్రతిష్ఠలకూ, సుఖ సంతోషాలకూ, కన్నకొడుకన్నా కాస్త కనికరంలేక తనచేతిలో కీలుబొమ్మగా...ఆటవస్తువుగా వుపయోగించుకుని చేసిన...చేస్తున్న దానవచర్యలు లెక్కబెట్టగలిగినశక్తి ఆ ఒక్క చిత్రగుప్తుడికే వుందిగానీ మానవమాత్రుడికి పూజ్యమనే చెప్పొచ్చు!

తండ్రి హృదయంలోని హాలాహలాన్ని మనసులోని విషసర్పాల్లాంటి ఆలోచనలను నూరోవంతయినా గ్రహించలేని యీ అమాయకుడికి...తండ్రిమాట వేదవాక్కు ! తన స్వార్థంకోసం వ్యక్తిత్వమనేది లేకుండా చేసిన తండ్రి పరమపూజ్యుడు.

తన సర్వతోముఖాభివృద్ధికి అన్నివిధాలా పాటుపడే వాడు తనతండ్రేననే గ్రుడ్డి నమ్మకాన్ని చిన్ననాటి చనుబాలలో కలిపి త్రాగించాడు.

తండ్రి ఏదిచేస్తే అది చెయ్యడమేగాక ఎదురు ప్రశ్నించడం జీవితంలో ఎరుగడు. ఇంతెందుకు; ఓరోజు

మాటమీదుగా సాహిత్యమంటే తనకెంతో ఇష్టమన్నాడు. మరి సాహిత్యమే చదవక యింజనీరింగ్‌కు ఎందుకు వెళ్ళారని తను అడక్కుండా వుండలేకపోయింది. 'ఇంజనీర్ కయితే ఎక్కువ కట్నమొస్తుంది గనక యింజనీరింగే చదవాలన్నారు నాన్న" అన్నాడు దీనంగా ముఖంపెట్టి. ఆరోజు మామయ్య అమానుషత్వంమీద కలిగిన క్రోధం వర్ణనకు సాధ్యంకాదు. అసలు సిసలైన ఖద్దరుబట్టల్లో దేశభక్తుని వేషంలో దర్శనమిచ్చే యీ రాజకీయనాయకుడు దేశాభివృద్ధిని కాంక్షించి కొడుకును యింజనీర్ చెయ్యలేదు కట్నంకోసం!

కొడుకు యిష్టాయిష్టాలకోసంకాదు. తనహద్దులు దాటిన స్వార్థంకోసం! మానవునిలో యింత స్వార్థముంటుందా? ఉంటే వుండొచ్చు ... కానీ ... కన్న తండ్రిలో...ఏవో...తనకర్థంకాని విషయాలు ప్రపంచంలో ఎన్నో వున్నాయనిపిస్తుంది. స్వచ్ఛమైన స్ఫటికంలా— పున్నమి వెన్నెల్లా - పసిపాప మనస్సులా - ప్రపంచపు విషపుగాలులనుండీ తుఫానులనుండీ దూరంగా వుండిపోయి కేవలం ప్రేక్షకుడిగావున్న మహేశ్...పవిత్ర పాదధూళి ముట్టుకోనైనా తను అర్హురాలు కాదు.అవును...తను అపవిత్రురాలు...కానీ మామయ్య కన్నానా? అనిపిస్తుంది ఒక్కోసారి...మహేశు పవిత్రతముందు తనహృదయం ఎందుకో విలవిల్లాడుతుంది. తనుచేసిన పొరపాటుకు ఇంత కన్నా మరొక ఘోరమైన శిక్ష లేదనిపిస్తుంది తన ప్రాణాలు పోయినా ఎంతో హాయిగా వుండేది.

మహేశ్ తేనెరంగు కనుపాపల్లో – కోపం, భయం, అసూయ, అహంకారం, ఏరోజూ తను చూడలేదు.

ఉద్రేకాలు శూన్యమైన ఓ బండ బాపమో? లేక ఉద్రేకాలను అదుపులో పెట్టుకోగల మహర్షా?

అనే అనుమానం యీరోజుకూ తన్ను పీడిస్తునే వుంది, ముఖంమీద చేతులు తొలిగించి తడికళ్ళతో మహేశ్ వైపు చూసింది.

"నిద్రపోతున్నావేమో గదూ ?"

సరోజ ముఖంలోకి చూసి అన్నాడు.

"లేదు..."

"నాన్నకి విషయం తెలుసుగదా ? మరి ఇలాంటి పని ఎందుకు చేశారు ?"

భగవాన్, తను విన్న మొదటిప్రశ్న యిదే !

అంత దుఃఖంలోనూ సరోజిని హృదయం సంతోషంతో గంతులేసింది.

"కట్నంకోసం !"

"అలాగా ! మీరే నాన్నను మోసం చేశారేమో అనుకున్నాను !" గొణుక్కున్నాడు.

తండ్రిమీద ఎంత విశ్వాసం !

ఇలాంటి కొడుకునా మావఁగారు మోసంచేసింది.

భగవంతుడు దయతలచి తన అపవిత్రతను కరుణా కటాక్ష వీక్షణలతో కడిగేస్తే యీ అమాయకుడిమీద ప్రపంచపు నీలినీడలు సోకకుండా మహోన్నత లోకాలకు

తీసికెళ్ళి పాదసేవ చేసుకుంటూ తన శేషజీవితాన్ని గడి పేయదూ? భగవాన్! యీ ఒకే కోరిక తీర్చు తండ్రీ!

సరోజ చెంపలమీదుగా నీళ్ళు జలజల రాలాయి. బైటికి పొంగనున్న ఏడ్పును బలవంతంగా నొక్కివేయడం చేత వుండుండీ వెక్కిళ్ళశబ్దం వినవస్తుంది.

బైట వర్షం జోరు మరీ ఎక్కువైంది.

"ఏడుస్తున్నావా ?"

మహేశ్ కంఠంలోని బాధా, బరువూ, నిస్పృహా గదిలో ప్రతిధ్వనించాయి. కట్టలు తెంచుకున్న చెలియలి కట్టలా, సరోజిని దుఃఖం గట్లు తెంచుకుని ప్రవహించింది. మహేశ్ సరోజినివైపు చూస్తూ కూర్చున్నాడు.

"నాన్నొస్తారు...ఏం సమాధానం చెప్తావు?" ఉన్నట్టుండి ప్రశ్నించాడు. సరోజిని కళ్ళు తుడుచుకొని మహేశ్ ముఖంలోకి కాసేపు చూసి—

"ఏం చెప్పమంటారు ?" అంది.

"నేనేం చెప్పను ? నాకేం తెలుసు ? నాకు... అవును...నాకేం తెలీదు...సరోజా !"

"నిజమే! మిమ్మల్నడగడం నా తప్పే!" బరువుగా నిట్టూర్చి అంది.

"నాన్న చెప్పినట్లు వినకుంటే...హుఁ...ఆ విష యాన్ని నా నోటితో చెప్పించకు"

"ఏమౌతుంది ? మీగడప త్రొక్కనీను; అంతేనా?" సరోజిని కంఠం సన్నగా కంపించింది.

"అవును......"

"తెలిసో, తెలీకో పొరపాటు చేశాను. దానికి పరిహారంగా దగ్గరదగ్గర లక్షరూపాయలు తీసుకున్నారు... ఎంత పాపాత్ములైనా కన్నబిడ్డను దూరంచేసుకోగలదా? అలా చెప్పడం మీకు న్యాయమేనా చెప్పండి?"

"న్యాయా న్యాయాలనుగురించి నన్నడక్కు సరోజా! వాటినిగురించి నాకేం తెలీదు?"

"యీ సంఘానికున్న శిక్షాస్మృతే భగవంతునిదగ్గరా వుంటుందంటారా!"

"అలాంటి విషయాలు నాకు తెలీవని ఎన్నిసార్లు చెప్పాను" విసుక్కున్నాడు మహేశ్.

"మాతృప్రేమను చంపుకున్నరోజు భగవంతుడు క్షమించడు...భూదేవి ఓర్చుకోదు...అందుకే పాపను వొదులుకోలేను"

తలుపుతట్టిన చప్పుడు. మహేశ్ లేచి తలుపుతీశాడు. మహేశ్ నాన్న, రాఘవయ్య లోపలికొచ్చి, గొడుగు ముడిచి మూలగాపెట్టి, మహేశ్ ప్రక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు. సరోజిని నేలచూపులు చూస్తూ కూర్చుంది.

"మన మిక్కడున్నట్లు మనవాళ్ళెవరికో తెలిసిందట...యిక ఆలస్యం చెయ్యడం ఏం బాగులేదు. పాపను యిక్కడ విడిచి వెళ్ళేందుకు అన్ని ఏర్పాట్లు చేశాను."

సరోజిని ముఖం పాలిపోయింది."వొదులుకోలేను... నామీద దయ చూపండి మావఁగారూ!"

జాలిగా అంది సరోజిని.

"దయ చూపొచ్చు...కాని నా పరువుప్రతిష్ఠ లేం కాను?"

"మరి ఆ పరువు ప్రతిష్ఠల విషయం ముందే ఎందు కాలోచించలేదు? ఆరోజు నా విషయం మీకు తెలుసుగా? కష్టం చూసేసరికి ఆలోచనాశక్తికూడా క్షీణించిందా?"

"నీ పతనానికి సాక్షీభూతంగా వున్న ఆ బిడ్డమీద నీకింత మమకారముందని నాకేం తెలుసు?" వెక్కిరింపుగా అన్నాడు.

"అనాథ...సాక్కుంటున్నామని చెప్పొచ్చుగా?" వచ్చే ఏడుపును మింగి అంది.

అనాథని చెప్పనా? ముమ్మూర్తులా నిన్ను తీసిపెట్టిన బిడ్డను అనాథని చెప్తే విని నమ్మేందుకు యీ సంఘం నువ్వనుకున్నంత గ్రుడ్డిది కాదు సరోజా! యిలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలన్నీ మాని ప్రయాణానికి సిద్ధంగా వుండు."

"పాపను వొదిలి వుండలేను."

"అయితే మీ పుట్టింటికెళ్లు."

"దగ్గర దగ్గర లక్షరూపాయలు పోసి అత్తారిల్లు కొనుక్కున్నానే...యీరోజు రావద్దని మీరన్నా...నాకు పొక్కుందన్న విషయాన్ని ఎలా మరచిపోగలను?"

"అంటే...కోర్టుదాకా వెళ్తానంటావా?"

"అవసరమైతే......మీరన్నా మావఁగారికి నచ్చ చెప్పండి" మహేశ్ ముఖంలోకి ప్రాధేయపూర్వకంగా చూస్తూ అంది.

"వాణ్ణి నీ చేతిలో కీలుబొమ్మగా చేసుకోవాలను కుంటున్నావా ?" గర్జించాడు రాఘవయ్య.

"అది నా ఆత్మ విరుద్ధమైనపని మావఁగారూ !"

వెకిలిగా, వ్యంగ్యంగా, పెదిమలు కదిలీ కదలనట్లు నవ్వాడు రాఘవయ్య.

సరోజని హృదయం బాధపడుతుని ఏడ్చింది. మహేశ్ కిటికీ అద్దంలోనుండి - చీకట్లోకి చూస్తున్నాడు - తనకేం పట్టనట్లు.

"నే వెళ్తున్నాను. తెల్లారేసరికి ఏదో ఒకటి నిశ్చ యించుకో."

"నిశ్చయించుకోవడం ఏరోజో జరిగిపోయింది. చేసు కున్న నిశ్చయమే మీతో చెప్పాను." మెల్లగా అంది సరోజిని.

"అదే నిశ్చయమా ?"

"అవును"

"అయితే మాగడప తొక్కేందుకూ్కడా వీల్లేదు." పండ్లు పటపటలాడించి అన్నాడు.

"వీలైన రోజే వస్తాను."

"హుఁ—వీలైనరోజు ! ఎప్పుడొస్తుం దారోజు ?... నువ్వు పతితవని నిరూపిస్తాను అందుకు నీ యీబిడ్డే సాక్ష్యం!" నిప్పురవ్వల్ను కళ్ళల్లోనుండి కురిపిస్తూ అన్నాడు.

"మీకు లక్షరూపాయలదాకా కట్నం తీసుకున్నట్లు నేనూ చెప్తాను మావగారూ! అన్నిపనులూ అందరం చెయ్య

గలము. చెయ్యగలిగీ, చెయ్యలేకపోతున్నామంటే దానికి కారణాలున్నాయి...ఏమంటారు ?”

రాఘవయ్యముఖం తెల్లగా పాలిపోయింది. హృదయంలోని వక్రరేఖితాలూంకు నీడలు ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. మరోమాటలేకుండా, మూలనున్న గొడుగు తీసుకుని చకచకా వెళ్ళిపోయాడు. అంతవరకూ ఓ నాటకాన్ని తిలకిస్తున్నట్లు కూర్చొనున్న మహేశ్ తండ్రి నిష్క్రమణతో యీ లోకంలో కొచ్చి - వెళ్ళేందుకు లేచి నిల్చున్నాడు.

“గొడుగు తీసికెళ్ళరూ ?”

“యీ రోజు నామన సెందుకో విపరీతంగా బాధ పడ్తోంది సరోజా !”

కన్నీటి పొరగుండా మహేశ్ ముఖంలోకి చూసింది సరోజిని.

*　*　*　*

ఆ మర్నాటి ఉదయం, నిర్జీవంగావున్న యింటిని చూసి గజగజలాడిపోయాడు మహేశ్. అమ్మా, నాన్నా, సరోజిన్ని చూసేందుకు హాస్పిటల్‌కు వెళ్ళారని తెలుసుకుని తనూ హాస్పిటల్ వైపుగా నడక సాగించాడు.

రాఘవయ్యా, రమణమ్మా, గేటుదగ్గర ఎదురు పడ్డారు.

“సరోజిని పోయింది మహేశ్ !”

దోసిట్లో ముఖం దాచుకుని వలవల ఏడ్చింది రమణమ్మ.

శిలాప్రతిమలా అలాగే నిలుచున్నాడు మహేశ్. ఎన్నో ప్రశ్నలు—ఎన్నో సంశయాలు...కానీ నోరు తెరిచి ఒక్కటీ అడగలేకపోతున్నాడు.

"జ్వరం తిరగ్గొట్టింది ... వాళ్ళనాన్నకు టెలిగ్రా మిచ్చాను... దహనసంస్కారాలు కాగానే మనం వెళ్ళి పోవాలి... వాళ్ళనాన్న ఎప్పుడొస్తారో ఏమో... ఎన్నా ళ్ళని పీనుగనలా పెట్టుకుంటాం?"

మహేశ్ వింటూ నిలుచున్నాడు. కాసేపటికి అనా లోచితంగానే ముందుకు కదిలాడు.

సరోజిని అచ్చు నిద్రపోతున్నట్టే వుంది. చివరిసారిగా పాపను చూడాలనిపించింది. నర్సును కలుసుకొని పాప వున్న గదిలోకి వెళ్ళాడు.

ఉయ్యాల్లో పాప - హాయిగా, ప్రశాంతంగా - ప్రపంచంతో సంబంధం లేనట్లు నిద్రపోతోంది.

సరోజిని రూపాన్ని పుణికి పుచ్చుకున్న పాప సరో జినిని గుర్తుచేసి మహేశ్ హృదయాన్ని కాస్త కలతపెట్టింది.

"పాపకు మీరేమవుతారు?" నర్సు ప్రశ్న.

"ఏమీకాను"

"సరోజినికి?"

"భర్తను"

"అందుకేనా సరోజినికీ పాపకూ యింత శిక్ష?"

అర్థంకాక తెల్లపోయి చూశాడు మహేశ్ నర్సు ముఖంలోకి.

"ఏమిటి మీరనేది?"

"ఏమాత్రం చదువుకున్నారు?"

మహేశ్ అదోరకంగా నర్సువేపు చూసి "లోకం దృష్టిలో పెద్దచదువే చదివాను" అన్నాడు.

"అందుకే కాబోలు అర్థంకాలేదు!" వ్యంగ్యంగా అంది నర్సు.

"యింతకూ మీరనేదేమిటి? సరోజిని సహజంగా చనిపోలేదంటారా?"

"అలాగే అనుకోండి! కాస్త మనశ్శాంతన్నా వుంటుంది!" వరండాలో కెళ్తూ అంది.

మహేశ్ హృదయం భయంతో గజగజలాడింది. మెదడు తనకు తెలీకుండా ఏవేవో ఆలోచిస్తుంది. కళ్ళు ఉయ్యాల్లోని పాపవైపు జాలిగా, దీనంగా చూశాయి.

—'జాగృతి' వారపత్రిక నుండి.

—:o:—